శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక – 13



మలయప్పస్వామి, తిరుమల




'పండితరత్న'
డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# శ్రీవిష్ణుపురాణప్రామాణ్యం

శ్రీ విష్ణుపురాణం పురాణాలు అన్నిటిలోనూ చాలా గొప్పది. ఇందులో ఉండే అర్థాన్ని తెలిసికోగలిగినా, తెలిసికోలేకపోయినా, దీనిని కేవలం పారాయణ చేస్తే చాలు, చాలా మంచి ఫలం కలుగుతుంది. ఈ పురాణంలో ఎన్నో ఉన్నతమైన తత్త్వాలు వివరింపబడ్డాయి. తత్త్వహిత పురుషార్థాల యథార్థ స్వరూపం ఇందులో వివరింపబడింది. దివ్యసూరులు అందరూ ఇందులోని సూక్తులలోని అర్థాలను తమ పాశురాలలో అనుసంధించారు. మన పూర్వాచార్యులు అందరు దీనిని పరమ ప్రమాణంగా గ్రహించి ఆదరించారు. భగవద్రామానుజులు కూడా శ్రీభాష్యంలో పలుచోట్ల ఇందులోని ప్రమాణాలను ఉదాహరించి ఈ పురాణం విశిష్టాద్వైత తత్త్వాలను తెలియజేస్తున్నదని నిరూపించారు. స్తోత్రరత్నంలో శ్రీయామునాచార్యులవారు దీనిని పురాణరత్నంగా అభివర్ణించారు, ఈ పురాణాన్ని అనుగ్రహించిన పరాశర మహర్షికి ప్రణామాలను తెలిపారు.

"వేదేషు పౌరుషం సూక్తం పురాణేషు చ వైష్ణవమ్,
భారతే భగవద్గీతా ధర్మశాస్త్రేషు మానవమ్"

(వేదాలలో అన్నిటిలోనూ పురుష సూక్తం ప్రధానమైనది, పురాణాలలో శ్రీ విష్ణు పురాణం ప్రధానమైనది, భారతంలో భగవద్గీత ప్రధానమైనది, ధర్మశాస్త్రాలలో మనుధర్మశాస్త్రం ప్రధానమైనది) అనే ఈ సూక్తి శ్రీవిష్ణు పురాణగౌరవాన్ని తెలుపుతున్నది.

శ్రీ వైష్ణవసంప్రదాయంలో మూడు రత్నమనే విశేషణంతో కీర్తింపబడుతున్నాయి. మంత్ర రత్నమని ద్వయ మంత్రం, పురాణరత్నమని శ్రీ విష్ణుపురాణం, స్తోత్రరత్నమని శ్రీయామునుల స్తోత్రం

వ్యవహరింపబడుతున్నాయి. స్తోత్రరత్నంలో శ్రీయామునులు శ్రీ విష్ణుపురాణాన్ని పురాణరత్నమని కీర్తించడానికి మూలమైన పది విశేషణాలను వేదాంతదేశికులు తమ స్తోత్రభాష్యంలో తెలియజేశారు. ఆ పది విశేషణాలు ఈ విధంగా ఉన్నాయి. ఇవి అన్నీ, అటు ఏదోషం లేని రత్నానికి, ఇటు శ్రీ విష్ణుపురాణానికి కూడా అన్వయించే విధంగా ఉన్నాయి.

1)అత్రాసమ్– అంటే దోషం రత్నంలో ఉండే దోషం. శ్రీవిష్ణుపురాణంలో ఎటువంటి దోషం లేదు కనుక, అత్రాసం అనబడుతున్నది.
2) మానదమ్– రత్నం ఎవరి దగ్గర ఉంటుందో వారికి గొప్ప గౌరవం ఉంటుంది. ఆ విధంగానే, శ్రీ విష్ణుపురాణం తనను అధ్యయనం చేసేవారికి గౌరవాన్ని కలిగిస్తుంది. అంటే, శ్రీ విష్ణు పురాణాన్ని అధ్యయనం చేసినవారిని లోకంలో అందరూ గౌరవిస్తారు. అటువంటి గౌరవాన్ని శ్రీ విష్ణుపురాణం తనను అధ్యయనం చేసిన వారికి కలిగిస్తుంది. అందుచేత మానదం అనబడుతున్నది
3) స్థైర్యం– రత్నం చిరకాలం నిలచి ఉండేటట్లే, శ్రీ విష్ణుపురాణం కూడా చిరకాల నిలచి ఉండేది –అని అర్థం.
4) భోగ్యం– రత్నం అనుభవించదగినది. ఆ విధంగానే శ్రీ విష్ణుపురాణం కూడా భగవంతుని స్వరూపరూప గుణ విభవ లీలలను వర్ణిస్తున్నందున పరమ భోగ్యంగా ఉంటుంది.
5) ప్రకాశకం– రత్నం ప్రకాశాన్ని కలిగి ఉంటుంది. ఆ విధంగానే శ్రీవిష్ణు పురాణం కూడా దానిని అధ్యయనం చేసినవానికి జ్ఞానవికాసాన్ని కలిగిస్తుంది.
6) మహార్ఘం– రత్నం గొప్ప విలువను కలిగి ఉండేటట్లు శ్రీ విష్ణుపురాణం కూడా అమూల్యమైనది. భగవంతునకు సంబంధించిన జ్ఞానం అమూల్యమైనది కదా.
7) మంగళమ్– రత్నం మంగళకరమైనది అయినట్లే, మంగళస్వరూపుడైన భగవంతుని తెలియజేసే శ్రీ విష్ణుపురాణం కూడా మంగళాత్మకమే.

8) మాన్యం –రత్నం గౌరవించదగినది అయినట్లే, శ్రీవిష్ణుపురాణం కూడా మిక్కిలి గౌరవించదగినది.

9) సురక్ష్యమ్– రత్నం చక్కగా రక్షించదగినది అయినట్లే, శ్రీవిష్ణు పురాణం కూడా చాలా జాగ్రత్తగా కాపాడుకొనదగినది పూర్వాచార్యులు దీనికి వ్యాఖ్యానాలను రచించి రక్షించి, ఇంకా అనేక ప్రయత్నాల ద్వారా మన వరకు అందేటట్లు చేశారు.

10) సుగ్రహం–రత్నం సులభంగా గ్రహించదగినది, అంటే, రత్నం ఎవరి చేతిలో ఉంటుందో, అది వారికి వారి ఇష్టం వచ్చినట్లు ఉపయోగించదగినదిగా ఉంటుంది. తాను ధరించవచ్చు, ఇతరులకు ఇవ్వవచ్చు, అమ్ముకోవచ్చు కూడా. ఆ విధంగానే, శ్రీవిష్ణు పురాణం కూడా తనను అధ్యయనం చేసినవానికి తనలో ఉండే అర్థం చక్కగా గురించేటట్లు అనుగ్రహించి, తగిన రీతిలో దానిని ఉపయోగించుకునే విధంగా ఉంటుంది.

ఈ విధంగా పది రీతులలో రత్నానికి, శ్రీ విష్ణు పురాణానికి సామ్యం ఉన్నది కనుక, ఈ పురాణం పురాణ రత్నమని అనదగినది– అని శ్రీదేశికుల అభిప్రాయం.

విద్యా స్థానాలు 14 అని చెప్పబడుతున్నాయి. అవి ఏవి? అంటే, " అంగాని వేదాః చత్వారః మీమాంసా న్యాయ విస్తరః, పురాణం ధర్మ శాస్త్రం చ విద్యా హ్యేతా చతుర్దశ" (వేదాలు నాలుగు, వాటి అంగాలు ఆరు, మీమాంస, న్యాయ శాస్త్రం, పురాణం, ధర్మశాస్త్రం అని ఈ విధంగా విద్యా స్థానాలు 14 అని చెప్పబడుతున్నాయి. అందుచేత ఈ 14 విద్యా స్థానాలలో పురాణాలు ఒక విద్యా స్థానం. అందుచేత ఇవి తప్పక అధ్యయనం చేయదగినవి. ఇంతేకాదు, వేదాలలోని అర్థాన్ని ఈ పురాణాల సహాయంతో నిర్ణయించాలని కూడా చెప్పబడుతున్నది. అందుచేతనే వీటికి వేదోపబృంహణాలు అని పేరు. ఉపబృంహణాలు అంటే అర్థాన్ని వివరించేవి అని అర్థం. వేదాలు సులభంగా

అర్థం చేసుకోవడానికి సాధ్యమైనవి కాదు అందుచేత వాటిలోని అర్థాన్ని మనం గ్రహించడం కోసమే మహా రుషులు పురాణాలను రచించి ఇచ్చారు.

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్,
బిభేత్యల్పశ్రుతాద్వేదః మామయం ప్రతరేదితి"

వేదాలలోని అర్థాన్ని ఇతిహాసాలు, పురాణాలు అనే వీటి సహాయంతో వివరించాలి. ఆ విధంగా ఇతిహాసాలలో, పురాణాలలో జ్ఞానం లేకుండా వేదాలను వివరించేవానిని చూచి వేదం "ఇతడు నాలో ఉండే అర్థాన్ని సరిగా తెలుసుకోలేక, అనుచితంగా తగని రీతిలో అర్థాన్ని చెబుతాడేమో! నన్ను మోసగిస్తాడేమో!" అని భయపడుతుందట. భగవద్రామానుజులు శ్రీభాష్యంలో ఈ శ్లోకాన్ని ఉదాహరించి, " ఇతి శాస్త్రేణ అర్థస్య ఇతిహాసపురాణాభ్యామ్ ఉపబృంహణం కార్యమ్" – ఇతిహాస పురాణాల సహాయంతో శాస్త్రంలో ఉండే అర్థాన్ని వివరించాలి– అని అంటారు.

భగవద్రామానుజులు శ్రీ భాష్యంలో స్మృతి పురాణ ఘట్టంలో ఉపబృంహణ పదానికి చాలా అందమైన నిర్వచనాన్ని చెబుతారు. "ఉపబృంహణం నామ విదితసకలవేదశబ్దానాం ప్రయోగమహిమసాక్షాత్కృత వేదతత్వార్థానామ్ వాక్యైః స్వావగతవేదవాక్యార్థ వ్యక్తీకరణమ్" – వేదవాక్యాల అర్థాన్ని తెలిసికొన్నవారు, పరమాత్మ వైభవాన్ని స్తుతించే వేద తాత్పర్యాన్ని తెలిసికొన్నవారు, చేసే వేదవాక్య వ్యక్తీకరణమే ఉపబృంహణం. ఇక్కడ వేదశబ్దానికి వేదాంతమని అర్థం. ఎందుకంటే, ధర్మశాస్త్రాలు వేదంలోని పూర్వభాగాన్ని ఉపబృంహణం చేయగా, వేదంలోని ఉత్తరభాగాన్ని ఇతిహాస పురాణాలు వివరిస్తున్నాయి. వేదంలోని పూర్వకాండకు కర్మకాండ అని, ఉత్తరకాండకు బ్రహ్మకాండ అని పేరు.

ధర్మశాస్త్రాలలో కూడా బ్రహ్మ ప్రతిపాదనంచేయబడింది. అయితే, అక్కడ ఉద్దేశం ఏమంటే, ఏ కర్మల చేత బ్రహ్మ ఆరాధింపబడుతున్నదో ఆ బ్రహ్మ యొక్క స్వరూపాన్ని తెలియజేయడంవరకే అక్కడ ఉద్దేశం. ధర్మ శాస్త్రాలలో ప్రధానమైన ప్రమేయం కర్మల ఆచరణను తెలియజేయడమే. కానీ, ఉత్తరకాండలో ఈ బ్రహ్మస్వరూపం చాలా స్పష్టంగా వివరించబడుతుంది.

ఇతిహాసాలలో, పురాణాలలో కూడా ధర్మ ప్రతిపాదనం చేయబడుతుంది. కాని, అది అంతా బ్రహ్మోపాసనకు అంగంగానే చేయబడుతుంది. ఇతిహాస పురాణాల ప్రధానమైన ఉద్దేశ్యం వేదాంతాల విశదీకరణమే. ధర్మశాస్త్రాలు కేవలం వేదంలోని పూర్వభాగ విశదీకరణం కోసమే ప్రవర్తించాయి. ఈ విషయాన్ని అంతటినీ శ్రీసుదర్శన సూరి శ్రుతప్రకాశికా వ్యాఖ్యానంలో వివరించారు. మహర్షులు, పూర్వాచార్యులు మనకు అనుగ్రహించిన గ్రంథాలు అన్నీ అమూల్యమైనవి. అవి పరమ ప్రమాణాలు. ఆపస్తంబులు, "ధర్మజ్ఞసమయః ప్రమాణం, వేదాశ్చ"(ధర్మాలను తెలిసినవారి ఆచారం ప్రమాణమైనది, వేదాలు కూడా) అని అంటారు. ఈ వచనంలో ఆ మహర్షి ధర్మజ్ఞుల ఆచారానికి మొదటి స్థానాన్ని ఇచ్చారు. ధర్మాన్ని తెలిసిన పెద్దలు ఆచరించే ఆచారమే పరమ ప్రమాణం అన్నారు. గౌతమ మహర్షి కూడా "వేదోఖిలో ధర్మమూలం, తద్విదాం చ స్మృతిశీలే" అని అన్నారు.

శ్రీ విష్ణు పురాణప్రాధాన్యాన్ని, వైభవాన్ని, ప్రామాణ్యాన్ని మనం తప్పక తెలుసుకోవాలి. ఈ విషయాన్ని గూర్చి శ్రీసుదర్శన సూరి శ్రుతప్రకాశికా గ్రంథంలో చాలా వివరంగా అనుగ్రహించారు. వారు శ్రీవిష్ణు పురాణం పరమ ప్రమాణమని అంటారు. " ప్రసిద్ధ్యతిశయలబ్ధసజాతీయప్రబంధ ప్రకర్షత్వాత్" అనేది అక్కడ వారి సూక్తి. శ్రీ విష్ణు పురాణం సత్వమూలమైనది. అందుచేత ఇది సాత్విక పురాణం. సాత్విక పురాణాలు అన్ని యథార్థానికి అనుకూలమైనవిగా

ఉంటాయి. చాలా పురాణాలు శివపారమ్యాన్ని చెబుతున్నప్పటికీ, అవన్నీ రాజసతామస పురాణాలుగానే లెక్కింపబడుతున్నాయి. భ్రాంతిమూలంగా ఎన్ని వేల, వందల వాక్యాలు చెప్పినప్పటికీ, అవి ప్రమాణాలు కాబోవు. భ్రాంతి లేకుండా యథార్థమైన జ్ఞానంతో ఒక్క మాట చెప్పినా, అదే ప్రమాణం అవుతుంది– అని శ్రుతప్రకాశికాచార్యుల వారు అంటారు. ఇక్కడ వారు చాలా ప్రమాణ వాక్యాలను ఉదాహరిస్తారు.

అగ్నేః శివస్య మాహాత్మ్యం తామసేషు ప్రకీర్త్యతే,
రాజసేషు చ మాహాత్మ్య మధికం బ్రహ్మణో విదుః,
సాత్వికేష్వర్థకల్పేషు మాహాత్మ్య మధికం హరేః"

(తామస పురాణాలలో అగ్ని, శివుల మహిమ ఎక్కువగా చెప్పబడుతుంది. రాజసపురాణాలలో బ్రహ్మ వైభవం తెలియజేయబడుతుంది. సాత్విక పురాణాలలో విష్ణుమహిమ తెలియజేయబడుతుంది)

దీనివల్ల విష్ణు పురాణం "యథార్థజ్ఞాననిష్పాదక సత్వమూలాన్యార్థజ్ఞాన విపరీత జ్ఞానహేతుభూత తమోమూలత్వాభావాత్" (యథార్థజ్ఞానాన్ని కలిగించే సత్త్వగుణాన్ని మూలంగా కలిగినందున, అన్యార్థజ్ఞానాన్ని, విపరీత జ్ఞానాన్ని కలిగించే తమోగుణమూలకం కానందున) ప్రమాణమైనది. అందువల్ల ఈ విష్ణు పురాణం తత్వాలను ఎటువంటి సంశయ విపర్యయాది దోషాలు లేకుండా ఉండే రీతిలో ప్రతిపాదిస్తుంది. ఇందులో అన్యార్థానికి కానీ, విపరీతార్థానికి కానీ తావు లేదు. దేహాత్మ భ్రాంతిని కానీ, అన్యశేషత్వభ్రాంతిని కానీ ఈ పురాణం కలిగించదు. అన్యార్థాలను, విపరీతార్థాలను కలిగించేది బుద్ధి తామస బుద్ధి –అని కదా గీతా, ఆచార్యుడు అన్నాడు. ఈ విధంగా అన్యార్థాలను తెలియజేసే ఉపదేశాలు కానీ,

విపరీతార్ధాలను తెలియజేసే ఉపదేశాలు కానీ ఈ పురాణంలో ఎక్కడా మనకు కనిపించవు. శ్రీవిష్ణుపురాణం ప్రమాణం కావడానికి ఇది ఒక ప్రధానమైన కారణం.

శ్రీ విష్ణు పురాణప్రామాణ్యానికి ప్రసిద్ధి అనేది ఇంకొక కారణం. ఈ విష్ణుపురాణం చాలా ప్రసిద్ధి చెందిన పురాణం. శ్రీశంకరాచార్యులవారు ఈ పురాణంనుండి వందలాది శ్లోకాలను తమ బ్రహ్మసూత్ర భాష్యంలో ఉదాహరించారు. శ్రీవిష్ణుపురాణ శబ్దాన్ని ప్రయోగించకుండానే, "తదుక్తం పురాణే" అని వారు అంటారు. దీనివల్ల అన్ని పురాణాలలోనూ ఇది చాలా ప్రసిద్ధమైన పురాణమని తెలుస్తున్నది. భగవద్రామానుజులు కూడా శ్రీ భాష్యంలో స్మృతి పురాణ ఘట్టంలో శ్రీ విష్ణుపురాణ శ్లోకాలను ప్రమాణంగా ఉదాహరించారు.

శ్రీ విష్ణుపురాణప్రామాణ్యానికి శ్రీ సుదర్శనసూరి తెలిపిన ఇంకొక కారణం ఏమంటే, మిగిలిన పురాణాలలో కనిపించినట్లు ఈ పురాణంలో బాధక ప్రత్యయం ఏమి లేకపోవడం. ఈ పురాణంలో అంతట శ్రీమన్నారాయణుడే జగత్కారణతత్వంగా ప్రతిపాదింపబడ్డాడు. ఈ పురాణం ఆరంభంలో మైత్రేయ మహర్షి అడిగిన ప్రశ్న సామాన్యమైన ప్రశ్న. "ఎవని నుండి ఈ ప్రపంచం పుడుతున్నది? ఎవనిలో నిలచి ఉన్నది? ఎవనిలో లభిస్తున్నది?" అని పరాశరమహర్షిని అతడు అడిగాడు. దీనికి సమాధానంగా పరాశరమ మహర్షి శ్రీమన్నారాయణుడే జగన్మూలతత్వమని తెలియజేశారు. కానీ, లింగ పురాణం మొదలైన మిగిలిన పురాణాలలో ప్రశ్న ఉండే రీతి, దానికి సమాధానం చెప్పే రీతి, రెండు వేరే. లింగపురాణంలో మొదట అడిగిన ప్రశ్నలోనే లింగ పదప్రయోగం చేయబడింది. దానికి అనుగుణంగానే సమాధానం కూడా చెప్పబడింది అందుచేత, ఇక్కడ ప్రశ్నలో కానీ, సమాధానంలో కానీ ఏ విధమైన విశేషం, వైలక్షణ్యం లేదు. కానీ, ఎక్కడ ప్రశ్న సామాన్యంగా అడగబడిందో, దానికి సమాధానం ఎక్కడ విశేష దేవతా పర్యవసానంగా చెప్పబడిందో, అక్కడ

అతిశయం గోచరిస్తుంది కదా. ఈ ప్రకారాన్ని విష్ణు పురాణంలో ఆరంభంలోనే గమనించవచ్చు. వేదంలో పలుచోట్ల సామాన్య శబ్దాల ద్వారా, విశేష శబ్దాల ద్వారా శ్రీమన్నారాయణుడే జగత్కారణ తత్వమని తెలియజేయబడింది. దేవతాంతరాలు ఎవరు జగత్కారణ తత్వం కాదని కూడా అవి తెలియజేశాయి. దీనివల్ల బ్రహ్మ కాని, శివుడు కానీ జగత్కారణ తత్వమని తెలియజేసే మిగిలిన పురాణాలు అన్నీ వేదార్థానికి విరుద్ధమైనవి అని ఏర్పడుతున్నది కదా. అంతే కాదు లింగపురాణంలో కూడా నారాయణ కారణత్వం స్పష్టంగా చెప్పబడిందని శ్రీ సుదర్శనసూరి సూచిస్తారు ఈ నారాయణ పరత్వం మనుధర్మశాస్త్రం మొదలైన పలు ధర్మశాస్త్రాలలో ఘోషింపబడుతున్నది. ఇది అంతా శ్రీవిష్ణుపురాణప్రామాణ్యాన్ని తెలియజేస్తున్నది.

శ్రీ సుదర్శన సూరి తెలిపిన ఇంకొక హేతువు ఏమంటే, వక్తృవైలక్షణ్యం. ఈ పురాణ ప్రవక్త పరాశరమహర్షి. "పరాన్ ఆశృణాతి ఇతి పరాశరః"– ఇతరులను, కాదనడానికి వీలులేని హేతువులతో, న్యాయాలతో ఓడించి హింసించేవాడు– అని ఈ పేరులోని అర్థం. వేదం కూడా పరాశరమహర్షి వైభవాన్ని పొగడింది. లింగపురాణం కూడా ఈ మహర్షి మహిమను కొనియాడింది.

ఈ పరాశర మహర్షి "పులస్త్య వశిష్ట వరదానలబ్ధవరదేవతాపారమార్థ్యజ్ఞానం" (పులస్యమహర్షి వశిష్ట మహర్షి అనుగ్రహించిన వరాల కారణంగా పరదేవతకు సంబంధించిన యథార్థమైన జ్ఞానం) కలవాడు. తాను ఈ విధంగా ప్రార్థజ్ఞానాన్ని పొందిన వృద్ధాంతాన్ని పరాశర మహర్షి స్వయంగా శ్రీవిష్ణుపురాణంలో తెలియజేశాడు. లింగ పురాణంలో కూడా పరాశరమహర్షి దేవతాపారమార్థ్యజ్ఞానాన్ని కలవాడని చెప్పబడింది ఈ పురాణానికి కల వైలక్షణ్యాలలో ఇది కూడా ఒకటి.

శ్రీ విష్ణుపురాణంలో వేదార్థాలు అన్ని తెలియజేయబడ్డాయి. మ ఈ పురాణం సర్వ వేదార్థసంయుతమని కీర్తింపబడింది అందుచేతనే ఇది సకల పురుషార్థాలను పొందడానికి ఆవశ్యకమైన జ్ఞానాన్ని ఇవ్వగలిగినది. ఈ విధంగా విష్ణుపురాణానికి కల ప్రబంధ వైలక్షణ్యం, వక్తృవైలక్షణ్యం వ్యక్తమవుతున్నాయి. విష్ణుపారమ్యం మిగిలిన పురాణాలలో ప్రతిపాదింపబడడం కూడా ఇక్కడ గమనించాలి.

శ్రీ సుదర్శనసూరి శ్రుతప్రకాశికవ్యాఖ్యలో ఒక ప్రాకృత శ్లోకాన్ని ఉదాహరించారు. ఒకడు తన భార్యను విడచి పెట్టి, వేరొక స్త్రీతో సంబంధాన్ని పెట్టుకుంటాడు. కొంతకాలం తర్వాత అతడు శ్రీవిష్ణుపురాణాన్ని విని, తన తప్పును తెలుసుకొని, పరివర్తనను పొందుతాడు. , "నేను శ్రీవిష్ణుపురాణాన్ని విన్నాను. నా తప్పును గ్రహించాను. ఇక నేను ఏ తప్పును చేయను. నేను ప్రాయశ్చితాన్ని చేసుకుని నా పత్ని దగ్గరకు పోతాను" అని అతడు అంటాడు. దీనినిబట్టి శ్రీ విష్ణు పురాణానికి గల ప్రసిద్ధి, మానవులకు పరివర్తనం కలుగజేయడంలో దానికి గల శక్తి వ్యక్తం అవుతున్నది.

అన్యపురాణాలలో అక్కడక్కడ పరస్పర వృద్ధమైన వాక్యాలు ఉన్నట్లుగా శ్రీ విష్ణు పురాణంలో కనిపించవు. ఇది కేవలం భగవంతుడైన శ్రీ విష్ణువుయొక్క పరత్వాన్ని తెలియజేయడంలోనే దృష్టి కలిగినది.

"పురాణం పంచ లక్షణమ్ " అని చెప్పబడుతున్నది. పురాణంలో ఉండే ఆ ఐదు విషయాలు ఏమిటంటే,

సర్గశ్ఛ ప్రతిసర్గశ్ఛ వంశో మన్వంతరాణి చ,

వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్"

(సృష్టి, ప్రళయం, పలు వంశాలు, మన్వంతరాలు, వంశాను చరితం అనే ఐదు విధాలయిన విషయాలను వర్ణించేదే పురాణం). ఈ ఐదు లక్షణాలు శ్రీవిష్ణుపురాణంలో చక్కగా అన్వయిస్తాయి

శ్రీరామాయణం శ్రీరాముని కథను తెలుపుతున్నది. అయితే, శ్రీరామాయణ రచనలోని ఉద్దేశం కేవలం శ్రీరామచంద్రుని వృత్తాంతాన్ని తెలుపడంలోనే ఉన్నదా? లేక, అంతకు మించి మరి ఏదైనా ఉద్దేశం ఉన్నదా ?అని ఆలోచిస్తే, శ్రీరామాయణంలోని "వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః " (వేదోపబృంహణంకోసం ఆ కుశలవులను వాల్మీకి తన శిష్యులుగా స్వీకరించాడు) అనే సూక్తి మనకు సమాధానం తెలుపుతున్నది. ఈ వచనం వల్ల వేదార్థాలను ఉపబృంహణం చేయడం కోసం శ్రీరామాయణం రచింపబడింది– అని తెలుస్తున్నది. ఈ విధంగానే, శ్రీ విష్ణు పురాణం కూడా కేవలం ఆయా వంశాల చరిత్రను వర్ణించడం కోసం రచింపబడలేదు. వేదార్థవిశదీకరణం కోసమే రచింపబడింది. శ్రీభాష్యంలోని స్మృతి పురాణఘట్టంలో భగవద్రామానుజులు " పులస్త్య వశిష్ట వరప్రదానలబ్ధదేవతాపారమార్థ్యజ్ఞానవతో భగవతః పరాశరాత్ స్వావగతవేదార్థోపబృంహణమిచ్ఛన్ మైత్రేయః పరిపప్రచ్ఛ"(పులస్త్యుడు మహర్షి, వశిష్ట మహర్షి అనుగ్రహించిన వరాల చేత యథాతథంగా దేవతాపారమార్థ్యజ్ఞానం కలిగిన పరాశరమహర్షి వల్ల తాను తెలుసుకొన్న వేదార్థాల విశదీకరణను పొందగోరిన మైత్రేయుడు పరాశరమహర్షిని ప్రశ్నించాడు) అని అనడం కూడా ఇక్కడ గమనించాలి. ఇందువల్ల శ్రీ విష్ణుపురాణం వేదంలోని అర్థాలను ఉపబృంహణం చేస్తున్నదని స్పష్టమవుతున్నది.

ఈ పురాణాన్ని పరాశరమహర్షి చెప్పాడు. ఈ పురాణం పవిత్రమైన ఒక గంగాజలం వంటిదని. ఇందులో మనం అవగాహిస్తే, మనం పవిత్రతను

పొందుతామని వేదాంతదేశికులు అంటారు. దేవలోకంలో ఉండే గంగానదిని భూమి పైకి భగీరథుడు తీసుకుని వచ్చినట్లే, పరాశర మహర్షి కూడా వేదార్థాలనే పవిత్రమైన గంగను విష్ణు పురాణరూపంలో వెలువరించి, మనకు అందించాడు.

శ్రీ విష్ణుపురాణం తత్వహితపురుషార్థాలను చక్కగా వివరిస్తున్నదని శ్రీయామునులు స్తోత్రరత్నంలో ఈ విధంగా అంటారు

"తత్త్వేన యః చిదచిదీశ్వర తత్స్వభావ–
భోగాపవర్గ తదుపాయగతీ రుదారః,
సందర్శయన్ నిరమమీత పురాణరత్నం
తస్మై నమో మునివరాయ పరాశరాయ"
(చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే ఈ మూడు తత్త్వాలు, ఈ లోకంలోని పురుషార్థాలు, మోక్షపురుషార్థం, వాటి ఉపాయాలు– అనే ఈ విషయాలను అన్నిటినీ తెలియజేస్తూ పరాశర మహర్షి పురాణరత్నం అనబడే శ్రీవిష్ణుపురాణాన్ని రచించారు. అటువంటి మహర్షికి నమస్కారం). ఈ లోకంలో ఉండే పూర్వార్ధంలో శ్రీవిష్ణుపురాణంలోని విషయ సంగ్రహం సూచింపబడింది.

వేదానికి– శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, విరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆరు అంగాలు ఉన్నాయి. ఆ విధంగానే, శ్రీవిష్ణుపురాణానికి ఆరు అంశాలు అనే విభాగాలు ఉన్నాయి. ఈ ఆరు అంశాలలో ఆరు వేదాంగాలలోని విషయాలు సూచింపబడ్డాయి– అని పెద్దలు అంటారు.

శ్రీ విష్ణుపురాణంలోని ఎన్నో సూక్తులకులోని అర్థాలను, తత్వాలను ఆళ్వార్లు తమ దివ్యప్రబంధాలలోని పాశురాలలో అనువదించారు. ఈ వివరాన్ని

అభిజ్ఞులైన మన పూర్వాచార్యులు ఆయా పాశురాలను వ్యాఖ్యానించే సందర్భంగా వివరించి తెలియజేశారు.

తిరువాయ్ మొ*ழி* ప్రబంధంలోని ఎనిమిదవ దశకంలోని పదవ పాశురంలో నమ్మాళ్వార్లు భగవంతుని " మాయామూర్తియాయ్" అని సంబోధించారు. ఇక్కడ ఈ పదంలోని "మాయా" శబ్దం సంస్కృతంలోని "మాయా" అనే శబ్దం కాదు. ఇది ద్రావిడ శబ్దం. దీనికి "నశించని, ఏకరూపమైన" అని అర్థం. అందువల్ల "మాయా మూర్తి "అని అంటే "ఏనాడు నశించని, ఏకరూపమైన రూపాన్ని కలవాడ"ని అర్థం. శ్రీ విష్ణు పురాణంలో భగవంతుని రూపం "సదైక రూపరూపాయ" అని చెప్పబడింది. దీనికి కూడా "ఎల్లప్పుడూ ఒకే విధమైన, ఏనాడు మార్పు చెందని రూపాన్ని కలవాడు" అని అర్థం. ఈ అర్థమే పైన ప్రస్తావింపబడిన ఆళ్వారుల "మాయామూర్తి "అనే ప్రయోగంవల్ల తెలుస్తున్నది. ఈ విషయాన్ని పెరియవాచ్చాన్ పిళ్ళై ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో పై విష్ణుపురాణ సూక్తిని ఉదాహరిస్తూ వివరించడంవల్ల గమనించవచ్చు.

ఈ ప్రబంధంలోనే పదవ శతకంలోని పదవ దశకంలో ఉండే ఎనిమిదవ పాశురంలో ఆళ్వారులు వరాహావతారానికి ఎత్తిన భగవంతుని రూపాన్ని కీర్తిస్తూ "నీలవరై ఇరండు పిఱై కవ్వి" అని అంటూ ఆ రూపం రెండు చంద్ర వంకలను ఇరువైపులా కలిగిన నల్లని పర్వతంవలె ఉన్నదని అన్నారు. ఈ సూక్తి శ్రీవిష్ణు పురాణంలోని "తతః సముత్ క్షిప్య ధరాం స్వదంష్ట్రయా మహావరాహః పుటపద్మలోచనః రసాతలాదుత్పలపత్రసన్నిభః సముత్థితో నీల ఇవాచలో మహాన్" (వికసించిన పద్మాల వంటి నేత్రాలను గల మహావరాహమూర్తి అప్పుడు భూమిని రసాతలంనుండి తన కోర దంతంతో ఎత్తినవాడై, నల్ల కలువల రేకుల వర్ణాన్ని కలవాడై, పైకి వచ్చిన గొప్ప నల్లని పర్వతం వలె ప్రకాశించాడు) అనే సూక్తిని

తెలపిస్తున్నది. ఈ విషయాన్ని పెరియా వాచ్చాన్ పిళ్లై ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానంలోను, అళకియ మణవాళ చ్చీయర్ పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానంలోనూ ఈ శ్లోకాన్ని ఉదాహరించి పైన ప్రస్తావించిన ఆళ్వారుల సూక్తిని వివరించారు. ఇటువంటి ఉదాహరణలు చాలా ఉన్నాయి.

శ్రీ విష్ణ పురాణంలో 6000 శ్లోకాలు ఉన్నాయి. ఈ శ్లోకసంఖ్యలోనే తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ అనే ఆచార్యులు భగవద్రామానుజుల అజ్ఞానుసారం నమ్మాళ్వారుల తిరువాయ్ మొఝికి ఆఱాయిరప్పడి అనే వ్యాఖ్యానాన్ని రచించారు.

శ్రీ విష్ణుపురాణానికి ఎంగళాఝ్వాన్ అని సంప్రదాయంలో ప్రసిద్ధులైన శ్రీ విష్ణుచిత్తులవారు అనుగ్రహించిన శ్రీవిష్ణుచిత్తీయం అనే వ్యాఖ్యానం ఉన్నది. శ్రీ విష్ణు చిత్తులు భగవద్రామానుజులకు శిష్యులు, . నడాదూర్ అమ్మాళ్ అనబడే శ్రీవాత్స్యవరదగురువులకు కాలక్షేపాచార్యులు. నడాదూర్ అమ్మాళే శ్రీ భాష్యానికి శ్రుతప్రకాశిక అనే సాటి లేని వ్యాఖ్యానానికి రచించిన సుదర్శన సూరికి ఆచార్యులు. ఈ విష్ణుచిత్తీయ వ్యాఖ్యానం సుమారు 100 సంవత్సరాలకు ముందు తెలుగులిపిలో, దేవనాగరిలిపిలో ముద్రింపబడింది.

# వేదంలో పురుషకార మహిమ

ఈనాడు వైకుంఠ ఏకాదశి. చాలా పవిత్రమైన దినం. అంతకుమించి, ఈ నాడు తిరుప్పావై ప్రబంధంలో "ఉందు మతకళిఱ్ఱన్" అనే పాశురాన్ని అనుసంధానం చేసికొనే విలక్షణమైన దినం. ఈ పాశురంలో నీళాదేవి ప్రబోధింపబడుతున్నది. నీళాదేవి, లక్ష్మీదేవి వలెనే మనకు భగవంతుని దగ్గర పురుషకారాన్ని చేసి, ఆ స్వామి సన్నిధిలో మనం చేసే శరణాగతిని ఫలించేటట్లు చేస్తుంది. ఆ విధంగా మనకు పురుషకారాన్ని చేసే విషయమే ఈనాటి పాశురంలోని ప్రధానమైన అర్థం. అందుచేత ఈ పాశురం, మన సంప్రదాయంలో చాలా ముఖ్యమైన ఒక తత్వాన్ని నిరూపించే పాశురం.

పురుషకారం చేయడం అంటే సిఫార్సు చేయడం అని అర్థం. లోకంలో కూడా ఒక పని సులభం కావాలంటే, అందుకు తగిన వ్యక్తుల దగ్గర నుండి పురుషకారం అపేక్షితం అవుతున్నది కదా. లోకంలో ఎంతోమంది ఈ సిఫారసు మూలంగా తమ తమ పనులను సులభంగా చేసుకోగలుగుతారు. ఆ సిఫారసు కూడా ముఖ్యమైన వ్యక్తుల ద్వారా చేయబడినట్లయితే కార్యం మరింత సులభం అవుతుంది. మన ఇళ్లల్లో కూడా చిన్న పిల్లలు తమ తల్లుల మూలంగా తాము కోరుకున్న కార్యాలను తండ్రి దగ్గర సాధించుకుంటారు. ఈ విధంగా ఉండే పురుషకారమహిమను తెలియజేసే ఒక వృత్తాంతం వేదంలో మనకు గోచరిస్తున్నది.

ఇంద్రుడు వృత్రాసురుని సంహరించిన తరువాత అతనికి మహేంద్రుడు అనే పేరు కలిగింది. లోకంలో అరుదైన కార్యాలను చేసేవారిని మహత్ అనే విశేషణాన్ని చేర్చి వ్యవహరించడం ప్రసిద్ధం. మహారాజు అని వ్యవహరింపబడుతున్నది కదా ఈ విధంగా మహేంద్రుని వృత్రాసురుని చంపి స్వర్గానికి తిరిగి వచ్చేటప్పుడు, దేవతలు అతనిని పొగడలేదు. అందువల్ల ఇంద్రునాకు చాలా అతృప్తి కలిగింది. వారితో అతడు "నేను చాలా గొప్పదైన

కార్యాన్ని సాధించి వచ్చాను కదా. నన్ను మీరు గౌరవించవద్దా! పొగడ వద్దో! నన్ను మీరు కీర్తించండి. గౌరవించండి. నాకు తృప్తిని కలిగించే పనిని ఏదైనా చేయండి. " అని ఇంద్రుడు వారితో అన్నాడు. అప్పుడు దేవతలకు ఏమి చేయాలో తెలియలేదు. ఏమి చేస్తే ఇందునకు తృప్తి కలుగుతుందో వారికి తెలియలేదు. "మేము నీకు ఏమి చేస్తే నీకు తృప్తి కలుగుతుందో మాకు తెలియడం లేదే. ఏమి చేస్తే నీకు తృప్తి కలుగుతుందో, దానిని నీవే చెప్పు" అని వారు అన్నారు.

అప్పుడు ఇంద్రుడు, "ఇంద్రుడు అనే పేరుతో నాకు యాగాలలో హవిస్సు లభించినట్లుగానే, మహేంద్రుడు అనే పేరుతో కూడా నాకు హవిస్సు లభించాలి. సవనాలలో మాద్యందినం అనే సవనం నాకు లభించాలి. శాస్త్రాలలో నిష్కైవల్యం నాకు చెందాలి. ఛందస్సులలో త్రిష్టుప్ కావాలి. సామాలలో పృష్ఠం కావాలి" అని ఈ విధంగా ఉన్నతమైన వస్తువులు అన్నీ తనకు కావాలని కోరాడు దేవతలు కూడా ఆ విధంగానే అతడు అడిగినదానిని అన్నిటినీ ఇచ్చారు. "సారమైన వస్తువులను అన్నిటినీ నువ్వు తీసుకున్నావు కదా. మా కోసం ఏదైనా నీవు ఇవ్వాలి" అని వారు ఇంద్రుని అడిగారు.

ఇంద్రునకు చాలా కోపం వచ్చింది. "యుద్ధ సమయంలో నన్ను విడిచి పారిపోయి మీరు వచ్చారు. అటువంటి మీకు ఏమీ ఇవ్వడానికి సాధ్యం కాదు" అని వారి ప్రార్థనను ఇంద్రుడు తిరస్కరించాడు. అప్పుడు దేవతలు "మాకు ఎక్కువ ఏమీ అక్కరలేదు. ఏదో కొంచెం మాకు ఇచ్చినా చాలు, మేము తృప్తి పడతాము" అని అన్నారు. కానీ దేవేంద్రుడు ఏమీ బదులు చెప్పకుండానే వెళ్ళిపోయాడు.

అప్పుడు దేవతలందరూ కలిసి ఆలోచించారు. ఇక ఇంద్రుని అడిగి ఏమి ప్రయోజనం లేదని వారికి తోచింది. "మనం ఎవరి ద్వారానైనా

పురుషకారాన్ని పురస్కరించుకొని ఈ కార్యాన్ని సాధించాలి" అని వారు భావించారు. అప్పుడు వారికి ఒక ఉపాయం తోచింది. అది ఏమంటే— ఇంద్రుని చిన్న భార్య పేరు ప్రాస. "ఆమె విషయంలో అతనికి చాలా ప్రీతి. ఆమె చెప్పిన మాటను అతడు కాదనడు" అని దేవతలు గ్రహించారు. అందుచేత ఆమె మూలంగా తమ కార్యాన్ని సాధించుకోవాలని వారు తలచారు. ప్రాస తన ప్రేమతో ఇంద్రుని వశీకరించుకోగలిగిన శక్తిని కలిగినది. అందుచేత దేవతలు ఆమె దగ్గరకు వెళ్లి తమ కార్యాన్ని వచ్చి తెలియజేసి, ఆ కార్యం తమకు సమకూడేటట్లు పురుష కారం చేయవలసినదని ఆమెను ప్రార్థించారు. అందుకు ఆమె సమ్మతించింది.

అప్పుడు ఆమె వారితో "ఇప్పుడు ఇంద్రునితో మాట్లాడి ప్రయోజనం లేదు. నేను తగిన సమయాన్ని గమనించి అతనితో మీ కార్యాన్ని గురించి మాట్లాడి సఫలం అయ్యేటట్లు చూస్తాను. ఎప్పుడు, ఏ విధంగా ఇంద్రునితో మాట్లాడితే మీ కార్యం పూర్తి అవుతుందో చూసి, నేను అతనితో మాట్లాడతాను. ఇప్పటికి మీరు వెళ్లి రండి. మీరు రేపు తిరిగి రండి. రేపటికి మీ కార్యం తప్పక సఫలం అవుతుంది. మీరు విచారించకండి" అని అన్నది. దేవతలు కూడా ఆ విధంగానే వెళ్లిపోయారు.

సామాన్యంగా లోకంలో పగటి వేళ దంపతుల మధ్య కొంత అభిప్రాయ భేదం ఉన్నప్పటికీ, రాత్రి ఏకాంతంలో వారి మనసులు ఒకటి అవుతాయి గదా. ఆ విధంగానే ఆనాటి రాత్రి వేళ ప్రాస, ఇంద్రునకు మనసు ప్రశాంతంగా ఉండే సమయాన్ని చూసి, దేవతల కోరికను గూర్చి ఇంద్రునితో ప్రస్తావన చేసింది. ఆమె మాటకు ఇంద్రుడు కూడా సమ్మతించి, దేవతల కోరికను తీర్చడానికి అంగీకరించాడు. ప్రాస చెప్పిన విధంగానే మరునాడు దేవతలు తిరిగి వచ్చారు. అప్పుడు ప్రాస "మీ విషయాన్ని గురించి ఇంద్రునితో మాట్లాడాను. అతడు సమ్మతించాడు. మీ కార్యం సఫలం అయింది" అని అన్నది అప్పుడు. ఇంద్రుడు దేవతలను చూచి తానే స్వయంగా "మీకు ఏమి కావాలో కోరుకోండి. తప్పక

ఇస్తాను" అని అన్నాడు. గత దినం తాము ఎంత ప్రార్థించినా, ఏమాత్రం అంగీకరించని ఇంద్రుడు ఇప్పుడు తానే స్వయంగా బలవంతం చేస్తూ, ఏదైనా అడగమని తమతో పలికిన రీతిని చూచి దేవతలు సంతోషించారు, ఆశ్చర్యపడ్డారు కూడా. అప్పుడు దేవతలు మేము 33 మంది ఉన్నాము. ఎనిమిది మంది వసువులము, 11 మంది రుద్రులము, 12 మంది ఆదిత్యులము, ప్రజాపతి, వషట్కారం– అని మొత్తం 33 మంది ఉన్నాము. అందుచేత 33 అక్షరాలను కలిగిన విరాట్ యాజ్యా మంత్రం మాకు కావాలి". అని వారు ఇంద్రుని అడిగారు. ఇంద్రుడు కూడా అందుకు సమ్మతించాడు. సామాన్యంగా విరాట్ అనే మంత్రం 10 అక్షరాలను మాత్రమే కలిగి ఉంటుంది. కానీ, ఇక్కడ దేవతలు 33 అక్షరాలను కలిగిన విరాట్ మంత్రాన్ని తమకు కావాలని కోరారు కనుక, ఆ విధంగాకూడా 33 అక్షరాలను కలిగిన విరాట్ మంత్రం ఒకటి ఉన్నదని తెలుస్తున్నది. దేవతలకు ఆ మంత్రం లభించగానే "తాము కోరుకున్న విధంగా ఆ విరాట్ మంత్రం తమకు లభించిందికదా " అని వారికి చాలా సంతోషం కలిగింది ఆ విధంగా తమ కార్యం సఫలం అయ్యేటట్లు పురుషకారం చేసిన ప్రాసకు కృతజ్ఞతా పూర్వకంగా ఋగ్వేదంలో ఒక మంత్రం ఆమెకు చెందేటట్లు చేశారు. ఈ విధంగా పురుషకారం వల్ల, పురుషకారం చేయబడిన వారు లాభపడతారు, పురుషకాహారం చేసినవారు కూడా లాభపడతారు– అని ఈ వృత్తాంతం వల్ల తెలుస్తుంది కదా.

మన శ్రీవైష్ణవ సంప్రదాయంలో కూడా లక్ష్మీదేవి పురుషకారం ద్వారా మనం భగవంతుని ఆశయించాలి –అనే విషయాన్ని మనకు పెద్దలు పలుమార్లు చెబుతున్నారు. అందుచేత మనం అందరం లక్ష్మీదేవిని పురుషకారంగా చేసికొని భగవంతుని ఆశ్రయించి, ఉజ్జీవిద్దాం. స్వస్తి.

# భగవద్గీత – తిరుప్పావై

సామ్య వైలక్షణ్యాలు

1) భగవద్గీత లోకానికి తండ్రి అయిన శ్రీకృష్ణునిచేత ఉపదేశింపబడింది. తిరుప్పావై ప్రబంధం లోకానికి తల్లి అయిన గోదాదేవి చేత ఉపదేశింపబడింది.

2) భగవద్గీత దేవతలకు కూడా దేవుడైన భగవంతునిచే ఉపదేశం చేయబడింది. తిరుపావై ప్రబంధం శ్రీకృష్ణునకు ఉపదేశింపబడినది. జీవుల పారతంత్ర్యాన్ని గూర్చి ఉపదేశించినందున అతనికి ఆచార్య స్థానీయురాలైన గోదాదేవిచేత ఉపదేశింపబడింది.

3) భగవద్గీత అర్జునుని వ్యాజంగా చేసికొని లోకానికి ఉపదేశింపబడింది. తిరుప్పావై ప్రబంధం శ్రీకృష్ణుని వ్యాజంగా చేసికొని లోకానికి ఉపదేశింపబడింది.

4) భగవద్గీత తన క్షత్రియ ధర్మాన్ని విడచి పెట్టిన అర్జునుని ఉద్దేశించి ఉపదేశింపబడింది. జగద్రక్షణను ధర్మంగా కలిగినవాడైనా దానిని విస్మరించిన భగవంతుని ఉద్దేశించి తిరుప్పావై ప్రబంధం ఉపదేశింపబడింది

5) భగవద్గీత సర్వజ్ఞుడైన భగవంతునిచే ఉపదేశింపబడినప్పటికీ, దానిని అర్జునుడు మరచిపోయాడు. తిరుప్పావై ప్రబంధం గోదాదేవిచే ఉపదేశింపబడినది. దానిని ఎవరూ మరచిపోలేదు. అందరూ దానిని అనుసరిస్తున్నారు.

.

6)భగవద్గీతను ఉపదేశించినందును చాలామంది ప్రాణాలు కోల్పోయారు తిరుప్పావై ప్రబంధాన్ని ఉపదేశించడం మూలంగా లోకంలో అందరూ ఉజ్జీవించే అవకాశం ఏర్పడింది

7) భగవద్గీత భారతంలో చెప్పబడినప్పటికీ, ఉపనిషత్తుగానే భావింపబడుతున్నది. ఇది చాలా పెద్ద ఉపనిషత్తు. 700 శ్లోకాలను కలిగిన ఉపనిషత్తు. తిరుప్పావై ప్రబంధం దివ్యప్రబంధంలో చేరినది. అందుచేత ఇది ఉపనిషత్తుగానే భావింపబడుతున్నది. ద్రావిడ ఉపనిషత్తుగా భావింపబడినప్పటికీ, ఉపనిషత్తులకు విత్తనం అయినందున చాలా చిన్న ఉపనిషత్తు, ఇది.

8) అర్జునుడు అనే పురుషుడైన స్నేహితుని ఉద్దేశించి శ్రీకృష్ణుడు దీనిని ఉపదేశించాడు. తమ స్నేహితురాండ్రను ఉద్దేశించి గోదాదేవి తిరుప్పావై ప్రబంధాన్ని ఉపదేశించింది. తిరుమంగై ఆళ్వారులు అనుగ్రహించిన పెరియతిరుమొ*ళ్గి* ప్రబంధంలోని "మానమరుమ్ మెన్నోక్కి" అనే దశకంలో చెలికత్తెను ఉద్దేశించి పరకాల నాయిక చెప్పినట్లుగానే, ఇక్కడ కూడా గోదాదేవి తన చెలికత్తెలను ఉద్దేశించి పలికింది .

9) భగవద్గీతలో శ్రీకృష్ణుడు చివరిగా చరమోపాయమైన ప్రపత్తిని ఉపదేశించాడు. తిరుప్పావై ప్రబంధంలో గోదాదేవి ఆ ఉపాయాన్ని మొట్టమొదటి పాశురంలోనే ఉపదేశించినది. ఆమె ఉపదేశించిన మార్గశీర్ష వ్రతం అంటే, అది, మార్గాలలో శీర్షంవంటిది, అంటే, మార్గాలలో ఉత్తమమైనది. అదే ప్రపత్తి. ఈ ప్రపత్తి భగవద్విషయంలోని ప్రపత్తిని మాత్రమే కాకుండా, చరమోపాయంలో చరమోపాయంగా చెప్పదగిన, ఆచార్య విదయమైన అభిమానమే, అంటే, °ఆచార్యాభిమానమే ఉత్తారకం°– అనే సర్వోత్తమమైన ఉపాయాన్ని ఈ తిరుప్పావై ప్రబంధం తెలియజేస్తున్నది –అని పెద్దల అభిప్రాయం.

10) భగవద్గీతను లోకానికి ఉపదేశించిన శ్రీకృష్ణుడు జగదాచార్యుడు అయినాడు. జగదాచార్యుడైన ఆ శ్రీకృష్ణునకు తమ పారతంత్ర్యాన్ని ఉపదేశించి, అతనికి కూడా గోదాదేవి ఆచార్య అయినది. చిన్న పిల్లలకు వేదాలను నేర్పించినట్లుగా, వేదాంతార్థాలను గోపికలకు ఉపదేశించి ఆచార్య అయినది.

11) సంసార సముద్రంలో మునిగి ఉండి, కష్టాలను అనుభవిస్తున్న లోకంలోనివారికి తత్వజ్ఞానం కలగడం కోసం శ్రీకృష్ణునిచే భగవద్గీత ఉపదేశింపబడింది. అందుచేత, భగవద్గీత శోకనివృత్తి కోసం ఏర్పడింది. ఆ విధంగానే, ఈ సంసారంలో పడి అనేక బాధలను అనుభవిస్తున్న జీవులను మంచి గతిని పొందేటట్లు చేయడం కోసం వరాహ స్వామి దగ్గర ఉపదేశాన్ని పొందిన భూదేవి గోదాదేవిగా అవతరించి, ఆ జ్ఞానాన్ని తిరుప్పావై ప్రబంధరూపంలో లోకంలో అందరికీ ఉపదేశించినది. అందుచేత ఇది కూడా శోకనివృత్తి కోసం ఏర్పడినదే.

12) భారతయుద్ధ సమయంలో అర్జునునకు మూడు విధాలైన శోకాలు ఏర్పడ్డాయి.
అవి ఏమంటే

1) బంధువులను వధించడం వల్ల పాపం కలుగుతుంది అనే శోకం,
2) దైవసంపద ఉన్నవానికి సద్గతి కలుగుతుంది. ఆసుర సంపద ఉన్నవారికి సద్గతి కలుగదు –అని చెప్పడం వల్ల, " నేను ఆసుర సంపదను కలిగి ఉండేవాడను అయితే ఏమి చేయాలి ?" అనే శోకం,
3) కఠినమైన, ఆచరించడానికి చాలా కష్టమైన కర్మ, జ్ఞానం, భక్తియోగాలను ఉపదేశంగా పొందినందున, తనకు వాటిని చేయడం సాధ్యం కాదే!– అనే శ్లోకం.

ఈ మూడిటిని శ్రీకృష్ణుడు గీతోపదేశం ద్వారా తీర్చాడు.

ఇక్కడ కూడా మూడు విధాలయిన శోకాలు ఏర్పడ్డాయి.
1)రేపల్లెలో దుర్భిక్షం ఏర్పడినందున ఇది తీరడం కోసం గోపికలు నోము చేసారు. అందుచేత దుర్భిక్షంవల్ల ఏర్పడిన శోకం వ్రతంద్వారా తీరింది. ఇది మొదటి శోకం.

2) రేపల్లెలోని గోపికలు నందకుమారుడైన శ్రీకృష్ణుని భర్తగా పొందాలని యమునానదీ తీరంలో అతనిని అర్చించారు. శ్రీకృష్ణుని భర్తగా పొందలేనందు వల్ల వారికి కలిగిన శోకం కూడా వారు వ్రతం చేసినందున తీరింది. ఇది రెండవ శోకం.

3) ఈ లోకంలోని జనులు ఈ లౌకికమైన విషయాలనే అనుభవిస్తూ ఆనందించే రీతిలోనే సంచరిస్తూ, ఈ తాపత్రయాలలోనే మునిగి బాధపడుతున్నారు. సద్గతిని పొందడానికి తగిన దారిని తెలియలేక వీరు ఉన్నందున, శోకసముద్రంలోని వీరు మునిగి ఉన్నారు. అశోకంకూడా ఈ వ్రతం వల్ల తీరిపోయింది

నోము, శ్రీకృష్ణుని భర్తగా పొందడం, తత్వాలను తెలియజేయడం –అనే ఈ మూడు ఈ తిరుప్పావై ప్రబంధంలో ఉపదేశింపబడినందున, పైన ప్రస్తావించిన మూడు శోకాలు తీరిపోయాయి.

ఇంకా, ఇటువంటి, చక్కని సామ్యాలను "భగవద్గీత– తిరుప్పావై ప్రబంధం అనే ఈ రెండిటి మధ్య సంభావించవచ్చు.

# తిరుప్పావై దివ్య ప్రబంధంలో గోచరించే కార్యనిర్వహణ కళలోని అంశాలు

గోదాదేవి రెండు ప్రబంధాలను లోకానికి అనుగ్రహించినది. ఈ రెండిటిని ఆమె ఐదు సంవత్సరాల వయస్సులో ఉండగా అనుగ్రహించినట్లు చెప్పబడుతున్నది ఈ రెండు ప్రబంధాలలో, ఒకటి– 30 పాశురాలను కలిగి బంధం తిరుప్పావై, వేరొకటి– 143 పాశురాలను కలిగిన నాచ్చియార్ తిరుమొళి అనే ప్రబంధం. తిరుప్పావై ప్రబంధం వేదానికి విత్తనంవంటిది అని శ్రీవైష్ణవాచార్యులు కీర్తిస్తున్నారు. నాలాయిర దివ్యప్రబంధాలలో, అధిక సంఖ్యలో వ్యాఖ్యానాలు కలిగిన ప్రబంధం ఈ తిరుప్పావై ప్రబంధం. దీనివల్ల ఈ ప్రబంధంలోని గొప్పతనం ఎటువంటిదో మనం గ్రహించవచ్చు వైష్ణవ తత్వాలను భారతదేశం అంతా ప్రచారం చేసిన భగవద్రామానుజులు ఈ తిరుప్పావై ప్రబంధం విషయంలో మిక్కిలి ఆదరాన్ని కలిగినవారు. కనుక. వారు తిరుప్పావై జీయర్ అని పేరుతో ప్రసిద్ధులయ్యారు ఈ ప్రబంధంలోని అందమైన అర్థాలు ఎన్నో ఉన్నాయి–అనే విషయం వ్యాఖ్యానాల ద్వారా, భగవద్రామానుజుల మనసును ఇది మిక్కిలి ఆకర్షించింది అనే విషయం ద్వారా మనం గ్రహించవచ్చు.

గోదాదేవి అనుగ్రహించిన రెండు ప్రబంధాలలోను సహజమైన వర్ణనలేకాక, మనం దైనందిన జీవితంలో గమనించవలసిన ఎన్నో అంశాలు, మధురమైన ద్రావిడ భాషాప్రయోగసౌందర్యాలు గోచరిస్తాయి. వీటితో పాటుగా, ఆధునిక కాలంలో ప్రసిద్ధమైన కార్యనిర్వహణకళలో చెప్పబడే ఎన్నో అద్భుతమైన అంశాలు కూడా ఇందులో మనకు కనిపిస్తాయి ఈ విషయాన్ని గమనించినప్పుడు సహజంగానే సనాతనధర్మంలో కార్యనిర్వహణ కలకు సంబంధించిన అంశాలు చోటి చేసుకున్నాయి– అనే విషయాన్ని మనం తెలియవచ్చు. ఇటువంటి, ఉన్నతమైన తత్వాలను కలిగిన ఈ ప్రబంధానికి, ఈ ప్రబంధాన్ని అనుగ్రహించిన గోదాదేవికి మనమంతా ఎంతో ఋణపడి

ఉన్నాము. ఈ ప్రబంధంలో గోచరించే, కార్యనిర్వహణప్రక్రియకు సంబంధించిన తత్వాలను కొన్నిటిని సంగ్రహంగా గమనిద్దాం.

ఒక పనిని ఆరంభించేటప్పుడు, ముందుగా తగిన కాలం గమనించి నిర్ణయించేసుకుని, తనకు తెలిసినవారికి సహాయపడి వారికి దానినిగూర్చి తెలిపి, భగవంతునకు నమస్కరించి ప్రార్థించడం అనేది లోకంలో అంతటా గోచరించే విషయం ఈ ప్రక్రియ వైయక్తికమైన విషయమం నుండి, పెద్ద పెద్ద సంస్థలవరకు అన్వయిస్తుంది. ఈ విధమైన కార్యనిర్వహణ ప్రక్రియలోని అంశాన్ని గోదాదేవి తన రెండు ప్రబంధాలలోను మొదటి పాశురంలోనే కూర్చడాన్ని గమనించినప్పుడు, మనకు చాలా ఆశ్చర్యం కలుగుతుంది.

తిరుప్పావై ప్రబంధంలోని మొదటి ఐదు పాశురాలు ఈ ప్రబంధానికి అవతారికగా చెప్పబడుతున్నది. ఈ ఐదు పాశురాల మూలంగా పలు విధాలయిన కార్యనిర్వహణప్రక్రియలోని అరుదైన అంశాలు వ్యక్తం చేయబడ్డాయి. దీనివల్ల గోదాదేవికి కల "ఆండాళ్" (కార్యనిర్వాహకురాలు, పరిపాలకురాలు) అనే పేరు సార్థకం అనే విషయం నిశ్చయమవుతుంది.

ఒక కార్యాన్ని ప్రారంభించే ముందుగా, దానికి తగిన నిర్ణయాలను చేసుకోవడం కోసం ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసుకోవాలి. దానికి తగిన తేదీ, సమయం, చోటు, ఆ కార్యక్రమాన్ని నిర్వహించే క్రమం మొదలైన ఆ కార్యక్రమ వివరాలను నిశ్చయించుకోవాలి.

దీనికే "ఎజెండా ఆఫ్ మీటింగ్, వెన్యూ, టైం, అండ్ డేట్" అని అంటారు. ఆ తరువాత, ఆ సమావేశంలో పాల్గొన తగినవారికి తెలియజేసి, వారిని సమావేశానికి ఆహ్వానించాలి. సమావేశం ఆరంభంలో, ప్రార్థన చేసి, కార్యక్రమ వివరాలను ఎటువంటి సంశయం లేని విధంగా, సంగ్రహంగా సభ్యులకు తెలియజేయాలి. దీనికి "ఎఫెక్టివ్ కమ్యూనికేషన్ స్కిల్" అని పేరు. ఒక కార్యక్రమాన్ని ప్రారంభించేటప్పుడు ఇది చాలా ఆవశ్యకం.

గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో "మార్గళి త్తింగళ్ మది నిఱైంద నన్నాళ్" అని ఒక గొప్ప మార్గశిరమాసాన్ని తాను చేసే వ్రతానికి తగిన మాసం అని, చంద్రుడు నిండుగా ఉండే దినం తగిన దినం అని నిర్దేశించినది. " నారాయణనే నమక్కే పఱై తరువాన్ ", అని ప్రార్థన చేసి, ఆమె ప్రారంభించిన కార్యం శభకరంగా నెరవేరాలి అని మొదటి పాశురం తెలియజేస్తున్నది.

మార్గశిర మాసం, ప్రాతఃకాలం— అనేవి— డే అండ్ టైం. వ్రతం చేసే చోటు శ్రీవిల్లిపుత్తూర్ అనే గోకులం ఇది వెన్యూ. ఇక్కడ శ్రీవిల్లిపుత్తూరు గోకులంగా (విజువలైజింగ్ ది కాన్సెప్ట్) దర్శింపబడుతున్నది. ఇదే గోదాదేవి కల్పనా శక్తిలోని సామర్థ్యం. "నీరాట్టమ్ " అనేది "ఎజెండా ఆఫ్ మీటింగ్" అనే కృష్ణానుభవం విషయం. ఇందులో పాలు పంచుకునే భాగగ్రాహులు గోపికలు అనే పేరుతో నిర్దేశింపబడే శ్రీవిల్లిపుత్తూరులోని బాలికలు. వీరిని "మీటింగ్ పార్టిసిపెంట్స్" గా పిలుస్తున్నది. " నీరాడ పోదువీర్" అని సంగ్రహంగా చేయవలసిన కృత్యాన్ని నిర్దేశిస్తున్నది, గోదాదేవి. నీరాటం అనే శబ్దాన్ని ఇక్కడ గోదాదేవి ప్రయోగించడాన్ని చూస్తే, మనకు ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

"నీరాడల్" (నీటిలో స్నానం చేయడం) అనేది తల మొదలు కాళ్ల వరకు తడుపుకొని, శరీరం మొత్తం శుద్ధి చేసికొనే ఒకానొక కార్యం. ఆ విధంగానే శరీరం మొత్తం, అంటే, ఒక్కొక్క శరీరంలోని భాగం శుద్ధి చేసుకున్నట్లుగానే కృష్ణానుభవాన్ని పొంది, ఆత్మను శుద్ధి చేసుకోవాలి— అనేది తిరుప్పావై వ్రతంలోని ఉద్దేశ్యం. నీరాట్టమ్ అనేది— సరి అయిన మాట, సంగ్రహమైన మాట, స్పష్టమైన మాట్. దీని మూలంగా గోదాదేవికి కల కర్తవ్యాన్ని తెలియజేసే సామర్థ్యం, అంటే, కమ్యూనికేషన్ స్కిల్, అంతేకాక, శబ్దప్రయోగసామర్థ్యం అంటే "సెలెక్టింగ్ ది ఆప్ట వర్డ్ టు కమ్యూనికేట్" అనేవి ఎంత గొప్పగా ఉన్నవి, అనే విషయం తెలుస్తున్నది.

"కూర్వేల్ కొడుమ్ తొழிలన్ నందగోపన్ కుమరన్ ఏరార్ న్ద కణ్ణి యశోదై ఇళమ్ సింగమ్ కార్మేని శెంగణ్ కదిర్ మదియమ్ పోల్ ముకత్తాన్ " అని

శ్రీకృష్ణుని నిర్దేశించినందున, ఏ విధమైన సందేహం, భ్రాంతి లేకుండా ఆమె ప్రార్థించే దైవం ఎవరు అనే విషయాన్ని ఉపమానాలతో పాటు సంగ్రహంగాను, సరసంగానూ మొదటి పాశురంలోనే తెలియజేసినది. దీనివల్ల కూడా గోదాదేవికి కల విషయాన్ని తెలియజేసే సామర్థ్యం కమ్యూనికేషన్ స్కిల్ స్పష్టంగా తెలుస్తున్నది.

ఒకరిని పరిచయం చేసేటప్పుడు, సంగ్రహంగా స్పష్టంగా అతనికి సంబంధించిన పూర్తి వ్యక్తిగతవివరాలను, అంటే, "ఫుల్ బయోడేటా" ను తెలియజేయడం ద్వారా విషయాన్ని తెలియజేసే సామర్థ్యం సభ్యులకు అర్థమవుతుంది. ఇక్కడ, గోదాదేవి, రెండు వాక్యాలలో శ్రీకృష్ణుడు ఎవరో తెలిపి, అతడే పరమాత్మ అయిన నారాయణుడు అని తెలియజేసింది.

“ఆయర్ శిఱుమీర్ గాళ్” అని ఆమె అందరిని ఆహ్వానించడం ద్వారా "టీం వర్క్, కలెక్టివ్ డెసిషన్" అనే రెండు, గొప్ప కార్యనిర్వహణలోని ఆవశ్యకమైన విషయాలను గోదాదేవి సూచనచేసినది. మొదటి పాశురంలో, తాము నిర్వహించవలసిన పనిని (టాస్క్ ను) "నీరాట్టమ్ " అని, గోపికలు "టాస్క్ ఫోర్స్" అని నిశ్చయించినది, గోదాదేవి.

ఈ విధంగా గోదాదేవి మొదటి పాశురంలో ఆధునిక కాలంలో కార్యనిర్వహణకు ఆవశ్యకమని భావింపబడే, ముఖ్య విషయమైన సమావేశాన్ని ఏ విధంగా నిర్వహించాలి? (హౌ టూ కండక్ట్ మీటింగ్) అనే విషయాన్ని, సమావేశాన్ని జరపడానికి తగిన చోటు, దినం, సమయం, (వెన్యూ, టైం, డేట్) మొదలైనవానిని, సమావేశానికి ఆవశ్యకమైన విషయాల అనుక్రమణికను (ఎజెండా ఆఫ్ మీటింగ్) ను, సమావేశంలో పాల్గొనే సరైన సభ్యులను ఎంపిక చేసుకోవడం (సెలక్షన్ ఆఫ్ మీటింగ్ పార్టిసిపెంట్స్), సామూహిక కృషి (టీం వర్క్), సమావేశంలో అందరూ కలిసి నిర్ణయించుకునే తీర్మానం (కలెక్టివ్ డెసిషన్), చేయవలసిన పని (టాస్క్), ఇంతే కాక, కర్తవ్యాన్ని నిర్వహించే సామర్థ్యాన్ని కలిగినవారి సమితిని ఎంపిక చేసుకోవడం (టాస్క్ ఫోర్స్ సెలక్షన్)

మొదలైనవానిని తెలియజేసింది. వీనిని మనం గమనించినప్పుడు, ఆరు సంవత్సరాల వయస్సును కలిగిన చిన్న బాలిక ఎటువంటి కార్యనిర్వహణసామర్థ్యాన్ని కలిగి ఉన్నదోకదా అనిపిస్తుంది. గమనిస్తే, మనకు చాలా ఆశ్చర్యం కలుగుతుంది. నిజంగా, లోకం అంతా పొగడదగిన ప్రజ్ఞావంతురాలు, గోదాదేవి– అని అనడంలో ఏ సందేహం లేదుకదా.

## గోదాదేవి –వైజ్ఞానిక దృష్టి, ఆధ్యాత్మిక దృక్పథం

"దైవవిశ్వాసం అనేది కేవలం ఒక మూఢవిశ్వాసమేనా? ఏ విధమైన వైజ్ఞానిక దృష్టి లేనివారు మాత్రమే దైవవిశ్వాసాన్ని కలిగి ఉంటారా? నమ్మకం అనేది ఒక సోమరితనానికి స్థానమా? దైవాన్ని నమ్మినవారు ఏమి చేయాలి? ఏం చేయక్కరలేదు. ఊరికే తలను అటు ఇటు ఆడిస్తే చాలు"– అని ఈ విధంగా లోకంలో పలువురు భావిస్తున్నారు.

కానీ, గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోని "ఆழி మழை కణ్ణా!" ఒక అద్భుతమైన పాశురంలో చాలా స్పష్టంగా వైజ్ఞానిక దృష్టి, ఆధ్యాత్మిక దృష్టి అనే రెండిటిని మేళవించి పలుకుతూ, "ఈ రెండు వేరువేరు కావు, దూరం కావు, వీటిలో, ఒక దృష్టిని కలిగినవారు ఇంకొక దృష్టిని కలిగి ఉండడం అసాధ్యమేమీ కాదు"– అనే విషయాన్ని చాలా చక్కగా తెలియజెబుతున్నది. ముందు పాశురాన్ని గమనిద్దాం.

**ఆழி మழை క్కణ్ణా!, ఒన్ఱు నీ కై కరవేల్ ***
**ఆழியుళ్ పుక్కు, ముగందు కొడు ఆర్ త్తేఱి ***
**ఊழி ముదల్వన్, ఉరువమ్ పోల్ మెయ్ కఱుత్తు ***
**పాழி అమ్ తోళుడై, ప్పఱ్పనాబన్ కైయిల్ ****
**ఆழி పోల్ మిన్ని, వలమ్ పురి పోల్ నిన్ఱదిర్ న్దు ***
**తాழாదే, శార్ జ్గమ్ ఉదైత్త శర మழை పోల్ ***
**వాழ ఉలగినిల్ పెయ్ దిడాయ్ * నాంగళుమ్**
**మార్గழி నీరాడ, మగిழ்న్దేలోర్ ఎమ్ పావాయ్**

దీని భావం ఏమంటే–

గంభీరమైన మండల వర్షాన్ని నిర్వహించేవాడవైన ఓ మేఘదేవా! నీవు నీ ఔదార్యంలో కొంచెం కూడా తగ్గించుకోకూడదు. లోకంలో ఉండేవారు సుఖంగా జీవించేటట్లు, మేము కూడా ఆనందించి మార్గశీర్ష వ్రతంలో స్నానం చేసేటట్లు నీవు సముద్రం మధ్యలోకి వెళ్ళి ప్రవేశించి, అందులోని నీటిని

తాగి, గర్జించి ఆకాశంలోకి వచ్చి కనిపించాలి. సృష్టి ప్రారంభ కాలంలో కాలం మొదలైన అన్ని పదార్థాలకు మూలకారణభూతుడైన, కరుణను కలిగిన శ్రీమన్నారాయణునివలె నల్లని రూపాన్ని కలవాడవై, బలిష్ఠాలైన, అందమైన భుజాలను కలిగిన పద్మనాభుని చేతిలోని సుదర్శనంవలె మెరవాలి. ఆ స్వామి చేతిలో ఉండే దక్షిణావర్తశంఖం అయిన పాంచజన్యంవలె గర్జించి, ఆ స్వామి విల్లు శార్ఙ్గంనుండి వెలువడే బాణవర్షంవలె వర్షాన్ని నువ్వు ఆలస్యం చేయకుండా వర్షించాలి.

లోకంలో వర్షం కురవడం ఏమీ విచిత్రం కాదు. నీరు ఆవిరి అయి, ఆకాశంలోకి పోయి, మేఘమై నల్లబడి, తరువాత నీరుగా భూమిపై వర్షిస్తుంది. అదే వర్షం– అనేది ఒక వైజ్ఞానిక దృక్పథం. ఈనాడు విజ్ఞానశాస్త్రజ్ఞులు చెప్పే విషయం ఇది. దీనిని ఇపుడు విజ్ఞానశాస్త్రజ్ఞులు తెలియజేయడానికి ముందే, చాలా కాలం క్రితమే, ఒక వనిత గోదాదేవి ఈ వైజ్ఞానికాంశాన్ని మనకు తెలియజేసింది. ఇద వర్షం ఏ విధంగా కురుస్తుంది? అనేదానికి విజ్ఞానశాస్త్రం చెప్పే బదులును ఈ పాశురంలో గోదాదేవి సూచిస్తున్నది. ఏ విధంగానో చూడండి.

వరుణ దేవా! నీవు నీ ఇష్టం వచ్చినట్లుగా ఊరిలో ఉండే చిన్న చిన్న గుంటలు, నదులు, చెరువులు అనే వీటిలో ఉండే పరిమితమైన నీటిని మాత్రమే ఆవిరిచేసి, దానిని తీసుకొని ఆకాశం లోకి పోయి, మళ్ళీ దానిని భూమికి వర్షంగా కురిస్తే ఏం ప్రయోజనం? అప్పుడు వర్షం సమృద్ధిగా ఉండదు కదా. అందువల్ల నీవు సముద్రంలో లోపలికి పోయి, అక్కడ ఉండే నీటిని పూర్తిగా గ్రహించి, ఆకాశంలోకి పోయి, భూమిపై దానిని వర్షంగా కురిపించాలి– అని అంటున్నది. అందుచేత ఇక్కడ భూమిలో ఉండే నీరే ఆవిరి ఆకాశంలోకి పోయి, వర్షం గా కురుస్తున్నది– అని సూచింపబడింది కదా.

సరే, మేఘం వర్షాన్ని కురిపిస్తున్నది. వర్షం కురిసిన తరువాత మేఘం అంత ఖాళీ అయిపోతుంది కదా. ఆ తరువాత ఏమి చేయాలి? ఇక తరువాత,

అది కురవలేదు కదా. అందువల్ల గోదాదేవి మేఘంతో ఏమని అంటున్నదంటే, "ఓ మేఘదేవా! ఏదో, వచ్చాను, వెళ్లాను, తోచినట్లు తోచిన విధంగా వర్షాన్ని కురిపించాను— అని నీవు ఉండకూడదు. నీవు ఏ విధంగా వర్షాన్ని కురిపించాలో తెలుసునా? శ్రీరాముని వింటినుండి వెలువడే బాణావర్షం వలె కురవాలి. శ్రీరాముడు ఎన్ని బాణాలు ఎంత సేపు ప్రయోగించినా, అతని అంబులపొదిలో ఉండే బాణాలు ఖాళీ కావు కదా. ఆ విధంగానే నీవు ఎంత వర్షం కురిపించినా నీవు ఖాళీ కాకూడదు. వర్షాన్ని కురిపించలేనివాడవు కాకూడదు" అని అంటున్నది.

సరే, అదే సాకు కదా అనుకొని, మేఘం అతివృష్టిని కురిపిస్తే ఏమవుతుంది? ఊరు వాడా, అంతా, జలమయమై, లోకానికి ఉపద్రవం కలుగుతుంది. ఆ విధంగా కాకూడదుకదా. అందుచేత దానిని కూడా ఆలోచించి, రెండు విషయాలను ఇక్కడ గోదాదేవి చెబుతున్నది.

అందులో ఒకటి ఏమంటే —మేఘం కరుణతో కురవాలి. "వరుణదేవా! శ్రీరాముని వర్ణం నలుపు కదా. నీవు వర్షాన్ని కురిపించిన తరువాత, నీ రూపం లో ఉండే నల్లధనం మారిపోయి, నీవు తెల్లగా కాకూడదు. ఎల్లప్పుడూ నీవు శ్రీరాముని వలెనే నల్లగానే ఉండాలి. అంటే, వర్షాన్ని కురిపించే శక్తిని కలవాడవుగానే ఉండాలి. ఎల్లప్పుడూ కరుణతో, కావలసి వచ్చినప్పుడు అంతా వర్షాన్ని కురిపించేవాడవై ఉండాలి. ఇది ఒక విషయం.

ఇక రెండవ విషయం ఏమంటే, శ్రీరాముని బాణావర్షం కంటే నీవు కురిపించే వర్షం విలక్షణంగా ఉండాలి. శ్రీరాముని బాణవర్షం శత్రువులను నశింప చేసింది. అంటే, అది నాశనానికి కూడా ఉపయోగపడింది. నీవు కురిసే వర్షం ఏ విధంగానూ ఎవరికి నాశనానికి కారణం కాకూడదు లోకంలో ఉండే అందరూ బాగుపడడానికి మాత్రమే నీ వర్షం ఉపయోగపడాలి. — అని అంటున్నది గోదాదేవి.

ఈ విధంగా ఒక వైపు వైజ్ఞానిక దృష్టి, మరొకవైపు ఆధ్యాత్మిక దృష్టి— అనే ఈ రెండిటిని కలిపి, ఈ పాశురంలో గోదాదేవి పలుకుతున్నది. రెండు

విధాలయిన దృష్టులను ఒకే చోట సమన్వయించి పలుకుతున్నది ఆధ్యాత్మిక దృష్టి వేరు, వైజ్ఞానిక దృష్టి వేరు కాదు, ఈ రెండిటి యొక్క చక్కని కలయికయే మానవ జీవితం —అనే విషయాన్ని గుర్తు చేస్తున్నది. తర్కరీతిలో చూచేవారు, పరిశీలించేవారు ఆధ్యాత్మిక దృష్టిని పక్కకు పెట్టవలసిన అక్కరలేదని చెబుతున్నది. ఆధ్యాత్మిక దృష్టిని కలవారు వైజ్ఞానిక దృక్పథాన్ని నిరసించవలసిన అవసరం లేదని తెలుపుతున్నది.

ఇవి రెండు పరస్పర విరుద్ధాలు ఏమాత్రం కావు, ఆధ్యాత్మిక దృష్టిని కలవారికి వైజ్ఞానిక దృక్పథం ఉండడం ఏమీ తప్పు కాదు, ఆ విధంగానే, వైజ్ఞానిక దృష్టిని కలవారు ఆధ్యాత్మిక దృష్టితో అన్వేషించడం, దానిని పొందడంలో తప్పేమీ లేదు —అని చెబుతున్నది. ఈ విధంగా గమనించి పలికే గోదాదేవి సమన్వయ దృక్పథాన్ని పొగడకుండా ఏ విధంగా మనం ఉండగలం?

ఆధ్యాత్మిక చింతన కలవారికి అంతా భగవత్స్వరూపంగానే తోస్తుంది. ఆ విధంగానే ఇక్కడ మేఘరూపంలోని ఒక్కొక్క అంశాన్ని భగవత్స్వరూపపరంగానే గోదాదేవి దర్శిస్తున్నది. ఆ స్వామి చేతిలోని శంఖంవలె ధ్వనించాలని అంటున్నది, చక్రంవలె మెరవాలని అంటున్నది, బాణవర్షం వలె కురవాలని అంటున్నది. ఈ విధంగా మేఘరూపం అంతా భగవంతుని రూపంగానే ఆమెకు తోస్తున్నది.

ఈ ప్రకృతి, భగవంతుడు అవినాభావ సంబంధం కలవారుగానే ఆమె దర్శిస్తున్నది. ఆధ్యాత్మిక దృష్టి, వైజ్ఞానిక దృక్పథం అనేవి రెండు ప్రకృతి సిద్ధమే కదా. అంతటా వ్యాపించి ఉండే ఈ ప్రకృతిలోనే భగవంతుడు ఉన్నాడు. ఈ భగవంతునిలోనే ప్రకృతి ఉన్నది. దానికి వర్షమే ఒక ఉదాహరణం.

మెరుపు— ఇది కాంతి, కంటిలో దర్శించేది,
మేఘ గర్జన —ధ్వని, చెవులతో వినేది.
వర్షం— చల్లదనం, శరీరంతో గ్రహించేది.

వర్షపు చినుకులు భూమిపై పడేటప్పుడు పైకి లేచే సుగంధం ముక్కుతో ఆస్వాదింపబడుతుంది.

వర్షం కారణంగా ఫలించే పంటలు ధాన్యమై నాలుకకు ఆస్వాదన కలుగజేస్తాయి. ఈ విధంగా ఈ ప్రకృతి ఐదు ఇంద్రియాలకు అనుభవం ఇస్తుంది. అదే ప్రకృతిస్వరూపం. అదే భగవత్స్వరూపం.

ఈ విధంగా ఈ పాశురంద్వారా ఎంత గొప్పదైన సందేశాన్ని లోకానికి గోదాదేవి అందజేసిందో కదా.

మళ్లీ ఒక్కసారి గోదాదేవి అనుగ్రహించిన ఈ పాశురాన్ని మనం కన్నులను మూసుకొని, మనసులో భావిద్దాం. అందులోని మధురమైన అర్థాలను సంభావన చేద్దాం.

# తిరుప్పావై – ఆఱ్ఱు ప్పడై ఇలక్కియమ్

ధనుర్మాసం ప్రారంభం కాగానే మనకు గోదాదేవి, ఆమె అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధం తప్పక స్మరణకు వస్తుంది. ఒక్కొక్కసారి తిరుప్పావై ప్రబంధాన్ని చదివేటప్పుడు, వినేటప్పుడు మనకు పలువేల సంవత్సరాలకు ముందు గోదాదేవి అనే ఆ చిన్న కన్నియ ఏ విధంగా 8 పాదాలు కలిగిన పాశురాలలో ఎన్ని విషయాలు కూర్చుంది? అనే సంగతిని గమనించినప్పుడు చాలా ఆశ్చర్యం కలుగుతుంది. అది ఈ 5G యుగంలో కూడా మనకు కలగడం ఇంకా ఆశ్చర్యం.

ఆళ్వారులు పదిమందికి ఒకే కుమార్తెగా అవతరించినది గోదాదేవి. ఈమె అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధం శంగత్తమిழ் మాలై అని కీర్తించబడుతున్నది. ఇందులో గోచరించే, సంఘ సాహిత్యానికి సంబంధించిన ఒక విలక్షణ ప్రక్రియను గమనిద్దాం.

సంఘకాల ద్రవిడ సాహిత్యంలో "ఆఱ్ఱు ప్పడై" అనే ఒక సాహిత్య ప్రక్రియ ఉన్నది. "ఆఱ్ఱు ప్పడై" అని అంటే. ఒక దారిలో ప్రయత్నం చేయడం. ఆఱు– అంటే దారి. పడైతల్–అంటే ప్రయత్నించడం. అంటే, ఒక దారిలో ఒక ప్రయోజనం కోసం ప్రయత్నం చేయడం –అని దీని అర్థం. పూర్వకాలంలో కవులు ఉదారుడైన ఒక ప్రభువును పొగడి కీర్తించి, బహుమానాన్ని పొంది, తిరిగి వచ్చే దారిలో ఆ విధంగా బహుమానాన్ని పొందని ఇతర కవుల దగ్గర తమకు ఆ బహుమానాన్ని ఇచ్చిన ఉదారుడైన రాజును గూర్చి పలికి, అతని దగ్గరకు వెళ్లి ప్రయత్నం చేయమని చెప్పడమే "ఆఱ్ఱు ప్పడై " అని తొల్కాప్పియమ్ ఈ ప్రక్రియకు లక్షణం పలికింది.

గోదాదేవి తిరుప్పావై ప్రబంధం ఒక చక్కని "ఆఱ్ఱు ప్పడై" ప్రక్రియకు చెందిన కావ్యం. బహుమానాన్ని పొందిన కవుల వలె వచ్చే దారిలో కాకుండా, గోదాదేవి తాను పోయే దారిలోనే అందరిని ప్రబోధించి "రండి! భగవంతుడు అనే గొప్ప ఉదారుని ఉద్దేశించి మనం కీర్తిస్తే మాత్రమే మనకు సంపద లభిస్తుంది" అని

తన చెలికత్తెలను తట్టి లేపి, వారు ఆ విధంగా ప్రయత్నం చేసేటట్లు చేసి, పావైవ్రతానికి తీసుకొని పోయింది. ఆండాళ్ పలికిన పావై వ్రతాన్ని చేయడానికి కావలసిన కార్యకలాపాలు చాలా సులభమైనవి. మానసిక పరిశుద్ధతతో ఆ భగవంతుని సులభంగా పొందడం అవుతుంది– అని ఆమె అంటున్నది. ఇది శ్రీవైష్ణవ సంప్రదాయంలోని విధానం.

భక్తిరసాన్ని మాత్రమే కాదు, విలక్షణమైన పద్ధతులు, వ్యవహారాలు, సహజమైన వర్ణనలు, పక్షుల ధ్వని, హాస్యం, గ్రామీణ జీవితంవంటి చలనచిత్ర కథలోని అంశాలవలె, తిరుప్పావైలో ఎన్నో ఆశ్చర్యకరమైన అంశాలను గోదాదేవి ఈ తిరుప్పావై ప్రబంధంలో ప్రస్తావించి, మనకు విస్మయాన్ని కలిగిస్తున్నది.

# గోదాదేవి – శ్రీదేశికులు

ఒక పర్యాయం వేదాంతదేశికులు గోదాదేవిని సేవించడం కోసం శ్రీవిల్లిపుత్తూరుకు వెళ్ళారు. ఆనాడు ఆ సమయంలో గోదాదేవి మాసతిరునక్షత్ర సందర్భంగా తిరువీథులలో వేంచేసే దినం. ఆనాడు దేశికులకు శరీరంలో ఆరోగ్యం బాగా లేనందున, ఆ సేవను సేవించలేకపోయారు. మనసులో గోదాదేవిని భావిస్తూ ఉండిపోయారు. ఏమి ఆశ్చర్యమో తెలుసునా? గోదాదేవి అలవాటు ప్రకారం వేంచేసే వీథిలో ఒక అనుకోని అసౌకర్యం సంభవించేటట్లు కల్పించి, తాను దేశికులు వేంచేసి ఉండే వీథిద్వారా వేంచేశారు. దేశికులు ఉండే తిరుమాళిగకు ముందుకు వచ్చి నిలచారు. దేశికులు తమ శరీరం ఉప్పొంగగా, ఆనందంతో "అమ్మా! ఏమి నీ కరుణ! ఏమి నీ దయ! "సాక్షాత్ క్షమాం కరుణయా కమలా మివాన్యాం గోదామనన్యశరణః శరణం ప్రపద్యే " అని ఆమెను సేవించి, వెంటనే ఆశువుగా ఆమె దయను గోదాస్తుతి రూపంలో కీర్తించారు.

ఈ గోదాస్తుతిలోని నాలుగవ శ్లోకంలో దేశికులు గోదావరి సదినిగూర్చి చెప్పేటప్పుడు, – గంగ మొదలైన పాపాలను పోగొట్టే పలు పుణ్యనదులు కూడా కొన్ని సమయవిశేషాలలో గోదావరినదిలో చిరకాలం వాసం చేసి, పవిత్రతను పొందాలి– అని దేవతానుగ్రహం ఏర్పడినట్లు పురాణ కథనం ఉన్నది. సీతాదేవిని రావణుడు ఎత్తుకొని పోయేటప్పుడు, సీతాదేవి "వందే గోదావరీం నదీమ్, క్షిప్రం రామాయ శంస త్వం సీతాం హరతి రావణః" అని గోదావరిని ఉద్దేశించి పల్కుతూ, " ఓ గోదావరీ నదీ! నన్ను రావణుడు తీసుకొని పోతున్నట్టు శ్రీరామునకు చెప్పు" అని వేడుకొన్నది. రావణునకు భయపడి గోదావరినది సీత చెప్పిన విధంగా శ్రీరామునితో చెప్పకుండా, సీతాదేవికి సేవను చేసే రీతిలోని భాగ్యవిశేషాన్ని కోల్పోయి, అపచారాన్ని చేసినది అయినది. కంసుని భవనానికి సమీపంలో ప్రవహించే యమునానది, వసుదేవుడు శ్రీకృష్ణుని గోకులానికి తీసుకొని వెళ్లేటపుడు సౌకర్యాన్ని కలుగజేసి, మోకాలి లోతు నీటిని మాత్రం కలిగి ఉండేటట్లు తాను మారి, దారిని ఇచ్చి, భగవద్భాగవత ప్రీతిని

పొందినదై, గోదాదేవిచేత "తూయ పెర నీర్ యమునై" అని మంగళాశాసనం చేయబడింది. అయినప్పటికీ, దయయే మూర్తీభవించిన గోదాదేవి, "గోదావరినదికి ఏర్పడిన దోషం తీరి పవిత్రతను పొందాలి" అని తాను గోదా అనే నామాన్ని ధరించి, ఈ తిరునామసంబంధంచేత గోదావరి కూడా గౌరవాన్ని పొందేటట్లు అనుగ్రహించిందికదా— అని గోదాదేవి దయను కీర్తించారు.

# గోదాదేవి – శ్రీవరవరమునులు

ఒకానొక సందర్భంలో, శ్రీ వరవరమునులు ఆళ్వార్ తిరునగరినుండి బయలుదేరి శ్రీవిల్లి పుత్తూరుకు ఆండాళ్ నీరాట్ట ఉత్సవాలను సేవించాలని వెళ్లారు. ఆ ప్రయాణంలో జరిగిన ఆలస్యం చేత, వారు శ్రీవిల్లిపుత్తూరుకు వెళ్లడం ఒక దినం ఆలస్యం అయినది. వారు శ్రీవిల్లిపుత్తూరు చేరే సమయానికి గోదాదేవికి జరిగే ఏడు దినాల నీరాట్ట ఉత్సవాలు పూర్తి అయిపోయాయి. తాము ఆశపడినట్లుగా ఆ ఉత్సవాలను సేవించలేకపోయామే! అని వారు చాలా బాధతో గోదాదేవిని మనసులో భావించి ప్రార్థించారు. గోదాదేవికూడా చాలా అనుగ్రహంతో, మనసులో వారిపట్ల ఉండే గౌరవంచేత, వారికి విభవంలో సేవను అనుగ్రహించి, వారి కోసం ఎనిమిదవనాడు కూడా నీరాట్ట ఉత్సవం కటాక్షించి, శ్రీవరవరమునుల మనసును సంతోషపెట్టింది. ఆనాడు సంక్రాంతి అయినది. అప్పుడు శ్రీవరవరమునులు "ఏమక్కాగ అన్రో ఇంగు ఆండాళ్ అవతరిత్తాళ్" అని చాలా కీర్తించారు. ఈనాటికీ, శ్రీవిల్లిపుత్తూరులో మాత్రం మార్గళి నీరాట్ట ఉత్సవం ఎనిమిదవనాడు కూడా జరుగుతుంది. ఆనాడు శ్రీగోదాదేవి శ్రీవరవరమునులు సన్నిధికి వేంచేయగా, శ్రీ వరవరమునులు కైతలత్తు సేవలో ఆమెకు ఎదురుగా వేంచేసి, ఆమెకు మంగళ శాసనం చేస్తారు. గోదాదేవికూడా వారికి మాలను, పరివట్టాన్ని, శఠారిని అనుగ్రహించి, కర్పూర హారతిని అనుగ్రహించి, వారి అందాన్ని కళ్ళారా దర్శించి, ఆనందిస్తుంది.

దీని మూలంగా, శ్రీ గోదాదేవి ఇంకా మనతో కలిసి జీవిస్తున్నది– అనేది నిశ్చయం అవుతున్నది. గోదాదేవి ఈనాటికి భక్తులు తమ మనస్సులలో తలచినవాటిని అన్నిటిని వెనువెంటనే జరిగేటట్లు అనుగ్రహించి, మన పాతకాలను తీర్చి, భగవంతుని శ్రీచరణాలను చేరుస్తుంది– అనే విషయంలో కొంచెం కూడా ఏ సందేహం లేదు.

# తిరుప్పావై లో ముప్పై ముత్యాలు

మార్గశిర మాసం వచ్చేసింది. చలివేళలో ఉదయ కాలంలో వీధులలో చిన్న ఆడపిల్లలు పేడతో గొబ్బెమ్మలు పెట్టడం, వాటి మధ్య గోరింట పూలను అలంకరించడంవంటి దృశ్యాలు మనోహరంగా గోచరిస్తున్నాయి. ఇందులో పేడతో పెట్టి ముద్ద గోపికగాను, దాని మధ్యలో ఉండే పువ్వును శ్రీకృష్ణుడుగాను కన్యలు సంభావన చేస్తారు ఇంటి వాకిళ్లలో దీపాలు మంగళకరంగా పెడుతున్నారు. అదిగో, ఆలయాలలో పాడే తీయని పాటల ధ్వని ఈ చలిగాలిలో పయనించి, మన చెవులకు మధురంగా వినబడుతున్నది. గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలోని పాశురాలే కదా ఈ పాటలు. అహా! ఎటువంటి మనోహర దృశ్యం! తిరుప్పావైలోని గొప్పతనాన్ని ఈ మార్గశిర మాసంలో 30 ముక్తకాల రూపంలో అనుభవిద్దాం, రండి.

**1) "మాసాలలో నేను మార్గశీర్షాన్ని"**

"మాసానాం మార్గశీర్షో ऽ హమ్" (నేను మాసాలలో మార్గశీర్షం)అని అన్నాడు, శ్రీకృష్ణుడు, భగవద్గీతలో. మిగిలిన మాసాలకు ఇది నాయకుని వంటి మాసం. శ్రీకృష్ణుని పొందడానికి శ్రీకృష్ణునకు చాలా ఇష్టమైన ఈ మార్గశీర్ష మాసంలో వ్రతాన్ని గోదాదేవి ఆచరించింది.

**2) ఇది దేవతలకు ప్రభాత కాలం**

మానవ మానాన్ని అనుసరించి ఒక సంవత్సరం కాలం అనేది దేవతలకు ఒక దినం మానవ మానంలోని ఒక నెల దేవతలకు రెండు గంటల కాలం. ఆ క్రమంలో, దేవతల సూర్యోదయకాలమైన ఆరు గంటలకు అనేది మనకు పుష్యమాసం అవుతుంది. పరదేవత అయిన శ్రీమన్నారాయణుని దేవతలు పూజించే బ్రహ్మముహూర్తమైన తెల్లవారుజామకాలం నాలుగు గంటల నుండి 6 గంటల వరకు ఉండే సమయం. ఇది మన లెక్క ప్రకారం

పుష్యమాసానికి ముందు ఉండే మాసమైన మార్గశిర మాసం అవుతుంది. ఈ బ్రహ్మముహూర్తంలో చేసే అనుష్ఠానమే మార్గశీర్షానుష్ఠానం అని చెప్పబడుతుంది.

**3) ఈ మాసంలో 30 దినాలు ముఖ్యమే.**

బ్రహ్మ ముహూర్తంలో చేయబడే ఏ కార్యం అయినా, చాలా గొప్ప ఫలాన్ని ఇస్తుంది. బ్రహ్మ ముహూర్తానికి ఏ విధమైన దిన, వార, తిథిదోషాలు ఏమి ఉండవు బ్రహ్మ ముహూర్తంలో చేసే పని ఏదైనా నూరు రెట్లు ఫలాన్ని కలుగజేస్తుంది, గొప్ప పుణ్యాన్ని ఇస్తుంది. అందుచేత, దేవతల బ్రహ్మముహూర్త కాలమైన ప్రభాతకాలాన్ని మార్గశిరమాసంగా నిశ్చయించారు. మార్గశిర మాసాన్ని పీడమాసం అని తెలియనివారు ఎవరో కొందరు అంటే అనవచ్చు. అయితే, మార్గశిర మాసం అన్ని విధాలయిన ఆధ్యాత్మిక కార్యక్రమాలు చేయడానికి తగిన మాసం. సామాన్యంగా, మిగిలిన మాసాలలో ఏవో కొన్ని దినాలు మాత్రమే ఆధ్యాత్మిక కార్యక్రమాలకు ప్రధానంగా లెక్కించబడతాయి. కానీ, మార్గశిర మాసంలో 30 నాళ్ళు పవిత్రమైన దినాలు కొనియాడబడుతున్నాయి.

**4) తిరుప్పావై మాసం**

మార్గశిర మాసాన్ని "తిరుప్పావై మాసం" అని పిలుస్తారు. తిరుప్పావై ప్రబంధం గోదాదేవి రచించిన ద్రావిడ ప్రబంధం. ఇందులో 30 పాశురాలు ఉన్నాయి. శ్రీవైష్ణవులలో ఒక అలవాటు ఉన్నది. వారు మార్గశిర మాసంలో తేదీలను నిర్దేశించేటప్పుడు మార్గశిరం ఒకటి, రెండు అని చెప్పరు. తిరుప్పావై పాశురాల ఆరంభంలో ఉండే మాటనే ఆ దినానికి గుర్తుగా నిర్దేశిస్తారు. ఉదాహరణకు, మార్గశిరమాసంలో మొదటి దినం అయితే, దానిని "మార్గశిరం ఒకటి "అని చెప్పకుండా, " మార్గ*ళి* త్తింగళ్" అని నిర్దేశిస్తారు. రెండవ నాటిని "వైయత్తు" అని పిలుస్తారు. ఈ విధంగా 30 దినాలను ఆనాటి తిరుప్పావై పాశురంలోని మొదటి పదంతోనే నిర్దేశిస్తారు.

**5) మాసం పేరుతోనే తిరుప్పావై ప్రబంధం ఆరంభం అవుతున్నది**

ద్రావిడ భాషలో ఎన్నో ప్రబంధాలు ఉన్నాయి. అయితే, ఒక మాసం పేరుతో ఒక మాసానికి విలక్షణమైన ప్రబంధం ఆరంభం కావడం తిరుప్పావై ప్రబంధంలో తప్ప వేరు ఏ చోటా మనం గమనించలేము. ఇంకా చెప్పవలసి వస్తే, గోదాదేవి అనుగ్రహించిన రెండు ప్రబంధాలు కూడా మాసం పేర్లతోనే ఆరంభం అవుతున్నాయి. తిరుప్పావై ప్రబంధం "మార్గ*ఴి*" అనే పదంతోను, నాచ్చియార్ తిరుమొ*ఴి* అనే ప్రబంధం "తై"అనే పదంతోను ఆరంభం అవుతున్నాయి. ఇంకా విశేషం ఏమంటే, ముందు మాసమైన మార్గమాసాన్ని తెలియజేప్పి మార్గ*ఴి* అనే పదంతో ముందు ప్రబంధం, తరువాతి మాసాన్ని నిర్దేశించే, తై అనే పదంతో తరువాతి ప్రబంధం ఆరంభం అవుతున్నవి.

**6) తిరుప్పావై జీయర్**

శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని అభివృద్ధి చేసిన భగవద్రామానుజలకు ఎన్నో పేర్లు ఉన్నాయి. ఉడైయవర్, భాష్యకారులు, ఎంబెరుమానార్, మొదలైన ఎన్నో పేర్లు వారికి ఉన్నప్పటికీ, ఆ మహనీయులు సదా సర్వకాలం తిరుప్పావై ప్రబంధాన్ని నోటితో అనుసంధించుకుంటూ ఉన్నందున, దాని అర్థాన్ని మనస్సులో భావిస్తూ ఉన్నందున వారికి తిరుప్పావై జీయర్ అనే పేరు ప్రసిద్ధమైనది. గోదాదేవి "నారు న*ఱు*మ్ పొ*ఴి*ల్" అనే దశకంలో నూరు గంగాళాల వెన్నను, నూరు గంగాళాల అక్కారవడిశిల్ పాయసాన్ని సుందరబాహుస్వామికి సమర్పిస్తానని వాక్కుతో మాట ఇచ్చింది. "ఆమె మాటను నిజం చేయాలి" అని తలచిన భగవద్రామానుజులు ఆ విధంగానే నూరు గంగాళాల వెన్నను, నూరు గంగాళాల పాయసాన్ని సుందరబాహుస్వామికి సమర్పించారు. అప్పుడు గోదాదేవి సంతోషంతో అర్చక సమాధిని విడచిపెట్టి, శ్రీరామానుజలను "అణ్ణా! " అని ఆదరంగా పిలిచింది. ఈ విషయమే శ్రీరామానుజుల వా*ఴి* తిరునామంలో పెరుంబూదూర్ మామునిక్కు పిన్నానాళ్ వా*ఴి*యే" అని చెప్పబడుతున్నది.

**7) "తిరుప్పావైను వివరించడం నాకు సాధ్యం కాదు"**

భగవద్రామానుజులు బ్రహ్మసూత్రాలకు వ్యాఖ్యానం రాసిన అద్వితీయమైన మేధాసంపత్తిని కలవారు. పలు వేదాంత గ్రంథాలను రచించినవారు. రామానుజులవద్ద, తిరుప్పావైకు అర్థం చెప్పమని, ఒక పర్యాయం ఎవరో అడుగగా, వారు చెప్పిన సమాధానము ఏమంటే, " గోదాదేవి అనే కన్య మనసులోని భావనను తెలియజేసే తిరుప్పావై ప్రబంధానికి ఒక మగవాడుగా పుట్టిన నాకు పూర్తిగా ఆమె మనస్సులో ఉండే భావనలను తెలుసుకొని వివరించడం సాధ్యం కాని పని " అని అన్నారట.

**8) అనుష్ఠాన ప్రబంధం**

ప్రబంధాలలో తిరుప్పావై ప్రబంధం అనుష్ఠాన ప్రబంధం అని అంటారు. మార్గశిర మాసంలో అంతా భాగవతులు గోదాదేవి మార్గాన్ని అనుసరించి, తమను గోపికలుగా భావన చేసుకొని, ఉదయకాలంలో తిరుప్పావై ప్రబంధాన్ని గానం చేసి, సమూహాలు, సమూహాలుగా ఏర్పడి గానం చేయడం మనం గమనించవచ్చు. భగవంతుడైన శ్రీమన్నారాయణుడు ఒక్కడే పురుషోత్తముడు, మిగిలిన జీవులందరూ స్త్రీలే. ఒక స్త్రీ మగవానిని పొందేటట్లు, జీవాత్మ భగవంతుని పొందే రీతిని తెలుపుతున్నది– ఈ తిరుప్పావై ప్రబంధం.

**9) వేణుగానం పాడే శ్రీకృష్ణుడు**

శ్రీకృష్ణుడు వేణువును వాయించడంలో మహాఘటికుడు అతడు ఉపయోగించే పిల్లనగ్రోవి వేణువు, మురళి, వంశి అని మూడు విధాలుగా ఉంటుంది. వీటిలో వేణువు అనేది ఆరు ద్వారాలను మాత్రమే కలిగి ఉంటుంది. ఇది 18 అంగుళాలు ఉంటుంది. చాలా మధురమైన ధ్వనిన ఇది వెలువరిస్తుంది. వంశీ అనే పేరు కలిగిన పిల్లనగ్రోవి సుమారు 15 అంగుళాలు ఉంటుంది 9 ద్వారాలను కలిగి ఉంటుంది శ్రీకృష్ణుని స్నేహితులైన గొల్ల పిల్లలకు చాలా ఇష్టమైనది ఇది. దీనిని ఊదేటప్పుడు అతని స్నేహితులు అయిన చిన్న గొల్ల

పిల్లలు అందరూ మైమరచి వింటారట. దీనిని పెరియాళ్వారులు "శిఱు విరల్ కళ్ తడవి పరిమాఱు" అనే పాశురంలో తెలియజేశారు.

**10) "ఇశై –ఇన్నిశై "**

శ్రీకృష్ణుని వేణుగాన మధురిమను విని పశువులు లేగ దూడలు కూడా తమ మేనును మరచి పోయాయి. చేతిలో పిల్లనగ్రోవిని పెట్టుకునే పశువులను మేపేటప్పుడు, వేణువును ఊదే శ్రీకృష్ణుని వేణుగానాన్ని ఇంద్రాది దేవతలు కూడా విన్నారు. అయితే, ఆ శ్రీకృష్ణుని మనస్సు కూడా తన్మయత్వాన్ని పొందేటట్లు చేసే మధురమైన సంగీతాన్ని కలిగినది తిరుప్పావై ప్రబంధం. అందువల్లనే పరాశర భట్టర్ "ఇన్నిశైయాల్ పాడి క్కొడుత్తాళ్" అని అన్నారు. వేణుగానం ఇశై. తిరుప్పావై గానం ఇన్నిశై.

**11)శూడి క్కొడుత్త శుడర్ క్కొడి**

గోదాదేవి రెండు పనులను చేసింది. మొదట పలు వర్ణాలతో కూడిన పూలతో మాలను గుచ్చి, అది ఆ భగవంతుని గొప్పతనానికి తగినట్లు ఉన్నదా? లేదా? అని తెలుసుకోవడం కోసం ముందుగా తాను దానిని ధరించి చూచి, అందంగానే ఉన్నదని తెలుసుకొని తరువాతనే, భగవంతునకు ఆ మాలను సమర్పించింది. సామాన్యంగా భగవంతునకు సమర్పించి తొలగించిన మాలను మాత్రమే భక్తులు ప్రసాదంగా గ్రహిస్తారు. అయితే, గోదాదేవికి కల భక్త్యతిశయం వల్ల తాను ధరించి తీసి పెట్టిన మాలనే భగవంతుడు ఇష్టంగా గ్రహించాడు. ఇందువల్ల గోదాదేవికి "శూడి క్కొడుత్త శుడర్ క్కొడి" అనే పేరు వచ్చింది. ఈనాటికి తిరుమల మొదలైన దివ్యక్షేత్రాలలో భగవంతుని ఉత్సవాలలో గోదాదేవికి అలంకరించి తీసిన మాల సమర్పింపబడుతున్నది.

**12) పాడి క్కొడుత్తాళ్**

గోదాదేవి చేసిన ఇంకొక కార్యం ఏమంటే– ద్రావిడ భాషలో అందమైన రెండు ప్రబంధాలను పాడి భగవంతునకు ఇచ్చింది. అందులో ఒకటి తిరుపావై ప్రబంధం. రెండవది నాచ్చియార్ తిరుమొ*ழி* అనే ప్రబంధం. ఈ విధంగా

గోదాదేవి పామాలను, పూమాలను– రెండిటిని భగవంతునకు సమర్పించింది, అయితే, ఆమె పాడి సమర్పించిన పామాల అయిన తిరుప్పావై అనే ప్రబంధం తెలియజేసే వ్రతం ఎన్నో వేల వర్షాలుగా మనకు అనుష్ఠానంలో ఉన్నది.

**13) వైష్ణవ దైనందిన ఆరాధనలో తిరుప్పావై**

తిరుప్పావై ప్రబంధం విషయంలో వీలైనంతవరకు శ్రీరామానుజులు అద్భుతమైన ఏర్పాట్లను చేశారు. భగవంతుని దైనందిన ఆరాధన క్రమాన్ని రచించినవారు నిత్యం అనే ఒక గ్రంథాన్ని రచించారు. అందులో ఆరాధన క్రమాలు స్పష్టంగా చెప్పబడ్డాయి. వీటిని ఆధారంగా చేసుకుని తరువాత తిరువారాధన క్రమం అని గ్రంథం ఏర్పడింది. ఈ ఆరాధన క్రమాన్ని తెలియజేసే గ్రంథంలో, ఒక్కొక్క ఆరాధన క్రమం కూడా తిరుప్పావై ప్రబంధంలోని పాశురాలతో సమన్వయించేటట్లుగానే కూర్చడం జరిగింది. సూక్ష్మంగా చెప్పాలంటే, "ఉదయకాలం ఆరాధనలో తిరుప్పావై తప్పక చోటు చేసుకోవాలి" అనే ఒక క్రమం పెద్దల చేత ఏర్పాటు చేయబడింది.

**14) కాశ్మీరు మొదలు కన్యాకుమారి వరకు తిరుప్పావై**

తిరుప్పావై ప్రబంధాన్ని గానం చేయడానికి కాలనియమం కాని, దేశనియమం కాని ఏదీ లేదు. అన్ని విశేషాలలో తిరుప్పావై ప్రబంధాన్ని శ్రీవైష్ణవులు అంతటా అందరు తప్పక అనుసంధిస్తున్నారు. ఆంధ్ర దేశంలోనూ, కర్ణాటకలోనూ ఇంకా మిగిలిన రాష్ట్రాలలో ఉండే భగవంతుని సన్నిధులలోను తిరుప్పావై ప్రబంధాన్ని తప్పక గానం చేసే క్రమాన్ని భగవద్రామానుజులు ఏర్పరచారు. ఆ క్రమం ఈనాటికీ కొనసాగుతున్నది. అన్యభాషలకు చెందినవారు తమ భాషలలో తిరుప్పావై ప్రబంధాన్ని వ్రాసి పెట్టుకొని, మార్గశిర మాసంలో దానిని పాడుకుంటున్నారు.

**15) తిరుమలైలో తిరుప్పావై**

సామాన్యంగా తిరుమలైలో సుప్రభాత సేవ అనేది ప్రాతః కాలంలో జరుగుతుంది. అయితే, మార్గశిర మాసంలో అక్కడ సుప్రభాత సేవను నిలిచి నిలిపివేసి,

తిరుప్పావై సేవను జరుపుతున్నారు.

## 16) గోదోపనిషత్తు తిరుప్పావై

వేదాలలో ఉండే చివరి భాగాన్ని ఉపనిషత్తులు అని అంటారు. ఆ ఉపనిషత్తుల సారమే శ్రీకృష్ణుడు అనుగ్రహించిన భగవద్గీత. అంటే, ఉపనిషత్తులు అనే పశువుల పాలే భగవద్గీత అని అంటారు భగవద్గీతను గీతోపనిషత్ అని అంటున్నారు. గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధం వేదంలోని సారమైన విషయాలను అన్నిటిని గ్రహించి అంతర్భవించుకున్నది. అందుచేత, "వేదమ్ అనైత్తుక్కుమ్ విత్తాకుమ్ కోదై తమిళ్" అని అంటున్నారు. గోదోపనిషత్తు భగవంతుని గీతోపనిషత్తు కంటే గొప్పది అని అంటున్నారు. ఈ అర్థాన్ని అనుసంధిస్తూ "పాతకంగల్ తీర్ క్కుమ్, పరమన్ అడికాట్టుమ్, వేదమ్ అనైత్తుక్కుమ్ విత్తాకుమ్ కోదై తమిళ్" అని అనుసంధింపబడుతున్నది కదా.

## 17) గీతోపనిషత్తు కంటే గోదోపనిషత్తు గొప్పది

గీత కంటే గొప్పదా తిరుప్పావై ప్రబంధం?అని అడిగితే, "అవును గొప్పది" అని అంటారు పెద్దలు భగవద్గీతలో 700 శ్లోకాలు ఉన్నాయి, కానీ, ద్రావిడ భాషలో గోదాదేవి పాడిన తిరుప్పావై 30 పాశురాలు మాత్రమే. భగవద్గీత సంస్కృత భాషలో ఉన్నది. ఆ భాష కఠినమైనది కానీ, తిరుప్పావై ప్రబంధం అందమైన, మధురమైన, సులువైన ద్రావిడ భాషలో ఉన్నది. శ్రీకృష్ణుడు అర్జునుని కోసం చెప్పినది, భగవద్గీత. ఆ శ్రీ కృష్ణునినీకోసం గోదాదేవి చెప్పినది, తిరుప్పావై ప్రబంధం. భగవద్గీతలో కర్మ, జ్ఞానం, భక్తి మొదలైన ఎన్నో మార్గాలు ఉపదేశించి, చివరిలో శరణాగతి అనే ఉపాయాన్ని "మామ్ ఏకం శరణం వ్రజ" అని "నన్ను ఒక్కని మాత్రమే శరణంగా ఆశ్రయించు. నీకు సకల పాపాలనుండి విడుదలను కలిగిస్తాను" అని ఉపదేశించాడు, కృష్ణుడు. అయితే, ఆ ప్రపత్తి మార్గాన్ని అంటే, శరణాగతిని మొదటి పాశురంలోనే గోదాదేవి స్పష్టంగా చెప్పింది. "నారాయణనే నమక్కే పఱై తరువాన్" అని అంటూ రెండు

ఏవకారాలతో దీనిని స్పష్టం చేసింది, గోదాదేవి. అందుచేత అన్ని విధాలలోను గీత కంటే గోదా గీత గొప్పది అని చెప్పవచ్చు.

**18) భగవంతుని అయిదు రూపాలు**

గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో 30 పాశురాలు "ఐయైందుమ్ ఇందుమ్" అని ఆరు భాగాలుగా విభజింపబడినది. భగవంతుడు అయిదు రూపాలను కలిగి ఉన్నాడు అని ఆగమశాస్త్రం తెలుపుతున్నది. అందులో ఒకటి పరమపదంలో ఉండే పరరూపం. తరువాత, అతడు పాలకడలిలో పరుండి ఉండే వ్యూహ రూపం. మూడవ రూపం, ధర్మస్థాపనం కోసం అతడు అవతరించిన పలు అవతారాలు. ఇక నాలుగవది, అతడు అక్కడక్కడ భూలోకంలో అభిమానించి వేంచేసి ఉండే అర్చావతారాలు. ఐదవది, వారి వారి హృదయాలలో పరమాత్మగా నిలచి ఉండే అంతర్యామి రూపం. ఈ ఐదు దశలను ఆరు మార్గాలలో తెలుపుతున్నారు. ఈ 6, 5 అనే రెండు అంకెలను గుణిస్తే 30 పాశురాలు అవుతాయి కదా. ఈ 30 పాశురాలే తిరుప్పావై.

**19) "ఆవై " ను (ఆత్మను) మార్చిన తిరుప్పావై**

భగవంతుడైన శ్రీమన్నారాయణుడు తమిళ భాషపై అంతు లేని వ్యామోహాన్ని కలిగినవాడు. ద్రావిడభాష ఎక్కడ అనుసంధింపబడుతుందో, అక్కడకు వెళ్లి దానిని వింటాడు. "పైందమిழ் పిన్నే శెన్ఱ పచ్చై పశుమ్ తమిழ் కొండల్" ఒక ద్రావిడ కవి అంటారు. అందుచేత ద్రావిడభాషలో భగవంతుని గమనాన్ని మార్చవచ్చు. గోదాదేవి తిరుప్పావై పాశురాలతో " ఆవై" ను, అంటే ఆత్మను భగవంతుడైన కృష్ణుని వైపు తిప్పినందున, "ఆవై తిరుప్పియ పాశురంగళ్ " తిరుప్పావై పాశురాలు అని కీర్తింపబడుతున్నాయి. మనం ఆ పాశురాలను పాడినప్పటికీ మన మనస్సు కూడా భగవంతుని వైపు మళ్ళుతుంది కనుక, మార్గళి మాసంలో ప్రతిదినం తిరుప్పావై ప్రబంధాన్ని పాడి, ఆ స్వామిని అర్చిస్తున్నాము.

## 20) ధనుర్మాసవ్రతం

తిరుప్పావై ప్రబంధాన్ని వ్రతప్రబంధం అని చెప్పవచ్చు. భగవంతుని పొందడం కోసం గోదాదేవి ధనుర్మాసమనే మార్గశిర మాసంలో పూర్తిగా ఉదయకాలంలో లేచి, స్నానం చేసి భగవంతుని ప్రార్థించినది. అందుచేత ఈ గ్రంథం ధనుర్మాస వ్రత గ్రంథం అని చెప్పబడుతున్నది. దీనిఫలంగా శ్రీకృష్ణుడే చక్కని భర్తను కన్యలకు లభింపచేస్తాడు. శ్రీవైష్ణవసంప్రదాయంలో ఈనాటికీ వివాహ సమయంలో పెండ్లి కూతురును గోదాదేవి స్వరూపంగానూ, పెండ్లి కుమారుని శ్రీకృష్ణుని స్వరూపంగానూ భావించి మంత్రాలను చెప్పి, వివాహ ప్రక్రియను నిర్వహిస్తారు. గోదాదేవి అనుగ్రహించిన వివాహ ప్రక్రియను తెలిపే పాశురాలను కూడా పఠించి, వధూవరులను ఆశీర్వదిస్తారు.

## 21) మంగళాశాసనపాశురం

ఇంచుమించుగా లోకంలో పెద్దలు ఎవరికైనా మంగళాశాసనం చేయడానికి ఉపయోగించే పాశురం గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలోని మూడవ పాశురమైన "ఓంగి ఉలగళంద" అనే పాశురమే. ఈ పాశురాన్ని ఒకవేళ పూర్తిగా చెప్పకపోయినా, పెద్దలు అక్షతాశీర్వాదం చేసేటప్పుడు, "నీంగాద శెల్వమ్ నిఱైందు" అని చెప్పి ఆశీర్వదిస్తారు. ఈ మాటలో అన్ని మంగళాశాసన వచనాలు అంతర్భవించి ఉన్నాయి. వేదాశీర్వాదంతో సమానమైనది ఇది.

## 22) ఏది మంచి దినం?

గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో ఏది మంచిది దినం? అనే విషయాన్ని గురించి ఒక అద్భుతమైన ఆలోచనను చేసింది ఆమె మొదటి పాశురంలో "మార్గழி త్తింగళ్ మది నిఱైంద నన్నాళ్" (మార్గశిర మాసం, పున్నమి చంద్రుడు నిండుగా ఉండే మంచి దినం) అని పాడింది. ఒకనికి భగవంతుని గూర్చిన జ్ఞానం ఎప్పుడు చక్కగా కలుగుతున్నదో ఆ దినమే అతనికి మంచి దినం. దీనిని తిరుప్పావై వ్యాఖ్యాతలు భాగవతంలో వచ్చే ఒక

సందర్భాన్ని ఉదాహరించి వివరిస్తూ తెలియజేశారు. కంసుని సేవలో ఉన్న వాడు. అక్రూరుడు. శ్రీకృష్ణుని ఏ విధంగా అయినా వధించాలని తలచిన కంసుడు శ్రీకృష్ణ బలరాములను ఇద్దరినీ మధురానగరానికి తీసుకొని రావడం కోసం అక్రూరుని పంపించాడు కంసుడు తనను తగని పనికి పంపించాడు– అనే భావం అక్రూరునకు ఉన్నప్పటికీ, శ్రీకృష్ణుని చూడగలుగుతున్నాను కదా అనే భావంతో మధురానగరానికి వెళ్లడానికి ఒప్పుకొని అతడు బయలుదేరాడు. మర్నాడు ఉదయం శ్రీకృష్ణుని అతడు చూడబోతాడు. దానికి ముందునాడు స్నానం చేసి సూర్యనమస్కారం చేస్తున్నప్పుడు, అతడు "నాకు ఈనాడు మంచి దినం" అని భావించాడట. " ఈనాడు శ్రీకృష్ణుని సేవించగలగలిగే భాగ్యం నాకు లభిస్తున్నదే ఆహా !ఈ దినం నాకు మంచి దినం !"అని అన్నాడు అందుచేత భగవంతుని సంబంధించిన జ్ఞానం కలిగిననాడే "మది నిఱైద నాళ్" (జ్ఞానం నిండుగా ఉండే సుదినం"అని చెప్పాలి.

## 23) ఆలయ అర్చనా క్రమం

తిరుప్పావై ప్రబంధంలోని 30 పాశురాలను ఈ విధంగా చెప్పవచ్చు. మొదటి అయిదు పాశురాలు భగవంతుని అయిదు రూపాలను తెలుపుతున్నాయి. తరువాత పది పాశురాలలో పదిమంది ఆళ్వారులను నిద్ర లేపడం జరిగింది. 16వ పాశురంలో భగవంతునితో ఉండే భక్తులను సహాయంగా చేసుకొని, తరువాత పాశురంలో శ్రీకృష్ణుని తండ్రి అయిన నందగోపాలును నిద్ర లేపి, తల్లి అయిన యశోదా దేవిని, నిద్రలేపి, బలరాముని నిద్రలేపారు. తరువాత తమను భగవంతునితో చేర్చే నీళాదేవిని శ్రీకృష్ణ స్వామిని నిద్రలేపి, అతడు నడచి వచ్చే నడక అందాన్ని సేవించి, అతనికి మంగళాశాసనం మంత్రాలను పాడి, తమ స్థితిని తెలియజేసి, తమకు, భగవంతునకు మధ్య ఉండే విడదీయరాని సంబంధాన్ని చెప్పి, తమ కోరికను వ్యక్తం చేసి, వ్రతాన్ని పూర్తి చేస్తున్నట్లుగా గోదాదేవి పలికింది. ఒక పూర్ణమైన ఆలయ అర్చనా విధానం ఈ విధంగా ఈ ప్రబంధంలో గోచరిస్తుంది.

**24) తిరుప్పావై ముత్తమిழ் ప్రబంధం.**

తిరుప్పావై ప్రబంధాన్ని ముత్తమిழ் ప్రబంధం అని చెప్పవచ్చు. ఇందులో ఇయల్ తమిழ், ఇశై త్తమిழ், నాటక త్తమిழ் అనే మూడు విధాలయిన విషయాలు ఉన్నాయి. జాగ్రత్తగా గమనిస్తే, తిరుప్పావై ప్రబంధం పూర్తిగా ఒక చలనచిత్రకథాక్రమంలోనే గోచరిస్తుంది. గోదాదేవి తాను ఏమి చేయబోతున్నది? అనే విషయాన్ని స్పష్టమైన మాటలతో తన స్నేహితురాండ్రు ఒక్కొక్కరి ఇంటికి వెళ్లి భగవద్గుణానుభవాలను గూర్చి పలికి సంభాషించి, వారి వద్ద భగవంతుని మహిమలను విస్తృతంగా ప్రస్తావించి పలికి, వారిని కూడా ఆ పిలుచుకొని, భగవంతుని సన్నిధిని చేరి, ఆ భగవంతుని దర్శించి, తన కోరికను విన్నవించి, ప్రబంధాన్ని పూర్తి చేసింది—అనేవే తిరుప్పావై లో మనకు కనిపించే దృశ్యాలు. "ఎల్లే ఇళమ్ కిళియే "అనే 15వ పాశురం పూర్తిగా, చాలా అందమైన నాటకీయ సన్నివేశంతో కూడుకున్నది. అందులో శ్రీవైష్ణవ సంప్రదాయ తత్వాలు నిండి ఉన్నాయి.

**25) శంగ త్తమిழ் మాలై**

తిరుప్పావై ప్రబంధాన్ని శంగ త్తమిழ் మాలై అని అంటున్నారు. గోదాదేవి ఈ పదప్రయోగాన్ని తిరుప్పావై ప్రబంధంలో చివరి పాశురంలోనే స్పష్టంగా "పట్టర్ పిరాన్ కోదై శొన్న శంగత్తమిழ் మాలై "అని అంటూ చేసింది. ద్రావిడ భాషకు తణ్ తమిழ் అని, వణ్ తమిழ் అని, శెమ్ తమిழ் అని, నత్తమిழ் అని ఎన్నో విశేషణాలు ఉన్నప్పటికీ ఈ "శంగత్తమిழ் "అనే విశేషణం మాత్రం ఇక్కడ చాలా యుక్తియుక్తంగా ఉన్నది. ఈ సందర్భంగా కొన్ని విషయాలు గమనిద్దాం.

1)సంఘకాలంలో ఉండే పండితులు తిరుమాల్ ను (భగవంతుని) ఏ విధంగా కీర్తించారో, . అదే పద్ధతిలో అందులో చెప్పబడిన సారమైన భావాలను పొందుపరచి, ఈ తిరుపావై ప్రబంధాన్ని రచించినందున ఇది సంఘకాల సాహిత్యానికి దీటైన, సాటి అయిన సాహిత్యం.

2) శంఖం (శంగమ్) అనేది ధ్వనించే పరికరం. వేదఘోషం ధనించినట్లే తిరుప్పావై ప్రతి దినం ఆలయాలలో ధ్వనిస్తుంది. అందుచేత తిరుప్పావైను వేదవిత్తు అని అంటున్నారు. శంఖం ధనించేటట్లే, ఒక్కొక్క ఆలయంలోనూ, ఇళ్ళలోనూ ధ్వనించే ద్రావిడ మాల కనుక, తిరుప్పావై శంగత్తమిఌ్మాలై.

3) ఇక మూడవ విషయం ఏమంటే, తిరుప్పావై ప్రబంధాన్ని గోదాదేవి తన ఏకాంతమైన అనుభవంగా వ్యక్తం చేయడం కాకుండా, " నీరాడ ప్పోదువీర్ పోదుమినో" అని అందరు భక్తులను కలుపుకుంటున్నది. అందుకోసం తన ద్రావిడాన్ని ఉపయోగిస్తున్నది. భక్తులను ఒకటిగా భగవదనుభవంలో సంగమించేటట్లు చేసే ద్రావిడ భాష కనుక, శంగ త్తమిఌ్ మాలై అని తిరుప్పావై ప్రబంధాన్ని చెప్పవచ్చు.

4) భగవంతునితో జీవాత్మ కలసి కొని, ఆనందాన్ని పొందడం సంస్కృతంలో సంశ్లేషం అని అంటారు. ద్రావిడ భాషలో దీనిని సంగం అని చెప్పవచ్చు. తిరుప్పావై ప్రబంధంలోని ఆర్ద్రమైన ద్రావిడం జీవులను భగవంతునితో సంగమించేటట్లు చేస్తున్నందున, దీనిని శంగత్తమిఌ్ అని చెప్పవచ్చు.

ఈ విధంగా

ద్రావిడ భాషచేత సంగమం,

భక్తులతో సంగమం

భగవంతునితో సంగమం

అని ఈ విధంగా మూడు దశలలో ఈ పాశురాలు ఉపయోగిస్తునందున దీనికి శంగత్తమిఌ్ మాలై అనే విశేషణం పూర్తిగా అన్వయిస్తుంది.

**26) తిరుప్పావై లో ఛందస్సు**

తిరుప్పావై ప్రబంధంలోని ఛందస్సు చాలా అందమైన ఛందస్సు 8 పాదాలను కలిగిన కలిప్పా ఇది. ప్రతిపాశురంలోని ఎనిమిదవ పాదంలో "ఏల్ ఓర్ ఎం పావాయ్" అనే పద సందర్భం 28 పాశురాలలో వస్తుంది. 17వ పాశురంలోన

ఓరెంపావాయ్ అని మాత్రం ఉన్నది. ఏల్ అనే పదం అందులో ఉఱంగేల్ అని ముందు పదంలోని వికృతిగా ఉన్నది. 30వ పాశురంలో మాత్రం ఎంపావాయి అని మాత్రం ఉన్నది. అందులో "ఎల్ ఓర్" అనే పదాలు లేవు. ఈ పదాలను తొలగించి ఒక్కొక్క పాశురంలోని ఎనిమిదవ పాదాన్ని చూస్తే అక్కడ ఉండే పదాలు 13 పాశురాలలో విన్నై ఎచ్చమ్ గాను, 16 పాశురాలలో విన్నై ముత్తుగాను ఉన్నాయి.

**27) ద్రావిడ లక్ష్య గ్రంథాలలో పావై వ్రతం**

ఈ పావై వ్రతం అనేది ద్రావిడ దేశంలో చాలా కాలంగా అనుసరింపబడుతున్నది. దీనిని ప్రాచీన ద్రావిడ సాహిత్యం అయిన కలి త్తొగై, పరిపాడల్ మొదలైన గ్రంథాలలో గమనించవచ్చు. "అమ్మా ఆడల్" అని ఇది అక్కడ నిర్దేశింపబడింది. పావై నోమును గురించి యాప్పరుంగల క్కారికై వృత్తిలో ప్రస్తావించబడింది. సంఘసాహిత్యంలో కనిపించే ఉన్నతమైన విధానాలు, భావాలు, పదాలు అన్ని ఆండాళ్ తిరుప్పావైలో గోచరిస్తాయి.

**28) ఆఱ్ఱు ప్పడై ఇలక్కియమ్**

"ఆఱ్ఱు ప్పడై ఇలక్కియమ్" లోని ఎన్నో అంశాలు తిరుప్పావై ప్రబంధంలో గోచరిస్తాయి. తాను ఒక ప్రయోజనం కోసం ప్రయత్నం చేస్తున్న విషయాన్ని గోదాదేవి స్పష్టంగానే తిరుప్పావై ప్రబంధంలోని చివరి పాశురంలో తెలియజేసింది. "ఆఱ్ఱు ప్పడై ఇలక్కియమ్" అనేది ద్రావిడ భాషలో సాహిత్యంలో ప్రక్రియలో ఒక విలక్షణమైన ప్రక్రియ. ఒక మార్గాన్ని తాను అనుసరిండమే "ఆఱ్ఱుప్పడై. " "ఆఱు " అంటే విధానం మార్గం— అని అర్థం. అందు చేత "ఆఱ్ఱుప్పడై. " అంటే— ఒక మార్గంలో ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి ప్రయత్నం చేయడం, లేక, ఒక మార్గంలో ఒక ప్రయోజనాన్ని పొందడం కోసం ప్రయత్నం చేయమని ప్రోత్సహించడం. ఇది ఒక విలక్షణమైన ద్రావిడ సాహిత్య ప్రక్రియ. తాము ఒక మార్గంలో ప్రయత్నం చేసి పొందిన సంపదను, గొప్ప ప్రయోజనాన్ని గూర్చి తమకు సన్నిహితులైన వారికి తెలియజేసి, తమవలెనే

వారు కూడా, ఆ ప్రయోజనాన్ని పొందడం కోసం తాను ఏ దైవంనుండి, లేక, ఏ ప్రభువునుండి ఆ బహుమానాన్ని లేక ప్రయోజనాన్ని పొందారో, ఆ దేవతను కానీ, ప్రభువును కానీ వారు ఆరాధించి, ఆ ప్రయోజనాన్ని పొందమని ప్రబోధించడమే ఈ ప్రక్రియా స్వరూపం.

గోదావరి భగవంతుడైన శ్రీమన్నారాయణుని ఆరాధించి, ఆ స్వామి అనుగ్రహం వల్ల స్వామి పాదాలలో కైకర్యమనే గొప్ప సంపదను తాను పొందిన విషయాన్ని ఇతరులకు తెలియజేపి, నవలెనే వారు కూడా ఆ స్వామిని సేవించి, ఆ విలక్షణమైన ప్రయోజనాన్ని పొందామని ప్రబోధించే విషయం ఈ తిరుప్పావై ప్రబంధంలోని చివరి పాశురంలో గల " తింగళ్ తిరుముకత్తు చ్చేయిழையార్ శెన్రిఱైంజి అంగు అప్పఱై కొండ వాఱ్ఱై——— పట్టర్ పిరాన్ కోదై శొన్న శంగ త్తమిழ் మాలై ముప్పదుమ్ తప్పామే ఇంగు ఇప్పరిశు ఉరైప్పార్ ఈరిరండు మాల్వరైత్తోళ్ శెంగణ్ తిరుముకత్తు చ్చెల్వ తిరుమాలాల్ ఎంగుమ్ తిరువరులేళ్ పెఱ్ఱు ఇన్బఉవర్" అని మొదలైన సూక్తి ద్వారా తెలియజేశారు ఇక్కడ "తింగళ్ తిరుముకత్తు చ్చేయిழையార్ శెన్రిఱైంజి అంగు అప్పఱై కొండ వాఱ్ఱై" అని చెప్పినందున, తాము పావై వ్రతాన్ని నోచి, భగవంతుని అనుగ్రహాన్ని పొందినట్లుగానే, మీరు కూడా మార్గశిర వ్రతాన్ని ఆచరించి, భగవంతుని అనుగ్రహాన్ని పొందవచ్చు— అని మార్గదర్శనాన్ని చేసినందున తిరుప్పావై ప్రబంధం "ఆఱ్ఱు ప్పడై ఇలక్కియమ్" అవుతున్నది.

**29) సింహంవలె భగవంతుడు**

తిరుప్పావై ప్రబంధంలో "మారి మఴై" అనే 23వ వాసురంలో శ్రీకృష్ణుని గొప్ప అందమైన సింహంవలె రావాలి— అని గోదాదేవి ప్రార్థించింది. సింహానికి జూలు చాలా అందంగా ఉంటుంది "హిరణ్యకేశః" అని కీర్తింపబడే కేశవుడు బంగారు మయమైన కేశాలను చక్కగా కలవాడై ప్రకాశిస్తాడు. ఆ కేశపాశం పరిమళభరితంగా ఉంటుంది. దాని నడకలోని గాంభీర్యం చాలా గొప్పగా ఉంటుంది. శ్రీరంగంలోని శ్రీరంగనాథుడు నాలుగు విధాలైన గతులలో

వేయించేస్తాడు సింహగతి, గజగతి, వ్యాఘ్రగతి, శరభగతి అనేవి ఆ నాలుగు గతులు.

అలుపు తీరేటట్లుగా సింహం లేచి శరీరాన్ని విదలించినప్పుడు ఆ గుహ అంత అల్లల్లాడుతుంది సర్వేశ్వరుని కదలికలో సకల జగత్తులు కథలాడతాయి ఏ దిక్కులోనూ పరబ్రహ్మ అతడు సకల చరాచర జగత్తులలో అంతట వ్యాపించి ఉన్నవాడు ప్రకాశించే వేదాలలో ఉండేవాడు చేతన చేతనాలను అన్నిటిని తనకు ప్రకారమై ఉండేవాడు ఈశ్వరునకు శరీరాలుగా ఈ ప్రకృతిలో ఉండే అన్ని వస్తువులు ఉన్నాయి అందుచేత అతడు స్పందించేటప్పుడు అవి అన్నీ స్పందిస్తాయి.

గుహలోనుండి సింహం కేసరాలను విదిలించుకుంటూ పైకి లేచినట్లుగా, నీవు పర్యంకం నుండి లేవడాన్ని మేము సేవించాలి. మా మనస్సులను నీవు, సింహంవలె, లేచి బయలుదేరే గంభీర్యంతో పరిపాలించాలి. "సర్వలోకాలను స్వామివి నీవు "అనేటట్లు గంభీరంగా వేయించేయాలి –అని ఈ విధంగా సింహంతో శ్రీకృష్ణుని పోల్చి, గోదాదేవి పాడే అందం మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

**30) పూవై ప్పూవణ్ణన్ (అతసీసుమవర్ణుడు)**

"కాయామ్ పూమేని వణ్ణన్ " అని శ్రీకృష్ణుని వర్ణంలోని అందాన్ని వర్ణిస్తారు, గోదాదేవి. "పూవై ప్పూవణ్ణా!" అని ఆమె శ్రీకృష్ణుని వర్ణిస్తున్నది. నీలవర్ణం అనేది మనోవ్యధను తీర్చి, రక్షణను కలిగించే వర్ణం– అని ఈ కాలంనాటి విజ్ఞానులు కూడా భావిస్తున్నారు. అందుచేత ఈ వర్ణం కరుణకు స్థానమైన మేఘాన్ని పోలి ఉన్నది. "ఆழிమழை క్కణ్ణా!" అని వర్షానికి దైవాన్ని పిలిచినా, అతనికి లోపల ప్రకాశించేవాడు అంతర్యామి అయిన అచ్యుతుడే కదా.

గోదాదేవి ఇక్కడ గాంభీర్యానికి ఉదాహరణగా సింహాన్ని చెప్పింది. ఆ కాఠిన్యానికి సరి అయిన మార్ధవాన్ని ఇక్కడ " అని

పూవైపూవణ్ణా" తెలియజేస్తున్నది. పరస్పరం వ్యతిరేకమైన రెండు వస్తువులుగా భగవంతుడు ఉన్నాడు. అన్ని వస్తువులుగా ఉన్నవాడు కదా, భగవంతుడు— అనే తత్త్వం ఇక్కడ తెలుపబడుతున్నది. అందమైన నడక, ఋజువైన దృష్టి ఉండే చోట మెత్తని హృదయం, కరుణాదృష్టి కలసి ఉండే శ్రీకృష్ణునిలో మాత్రమే దర్శించడానికి సాధ్యం— అనేది గోదాదేవి నమ్మిక. నిజానికి ఒక ఉదాహరణానికిగా సింహాన్ని, అతసీసుమాన్ని ఉపమానంగా చెప్పారు తప్ప, ఏ విధమైన ఉపమానం లేని, మహోన్నతుడైన అతనిని వర్ణించడానికి ఏ మాట, ఏ అర్థం కూడా చాలదు కదా.

**ఉపసంహారం**

ఈ విధంగా దర్శించిన చోట అంతా రసమయంగా ఉండే తిరుప్పావై ప్రబంధంలోని 30 పాశురాలను మార్గశిర మాసంలో పాడి, భగవంతుని కరుణ పత్రం అవుదాం తిరుప్పావై ప్రబంధాన్ని ప్రతి దినం గానం చేయడం ద్వారా అన్నిచోట్ల అందరూ భగవంతుని కరుణను పొంది ఆనందించవచ్చు— అనేది గోదాదేవి మహాదాశయం. అది సఫలం కావాలని, అవుతుందని కోరుకుందాం. స్వస్తి.

## శ్రీదేశికుల శరణాగతి దీపికలోని ఒక శ్లోకం

**కాశీవృకాంధకశరాసనబాణగంగా–**

**సంభూతినామకృతిసంవదనాద్యుదంతైః।**

**సోప్యక్ష్యంబరీషభయశాపముఖై శ్చ శంభుం**

**త్వన్నిఘ్నమీక్షితవతా మిహ కః శరణ్యః ? ॥**

కాశిలో జరిగిన యుద్ధం, వృకాసురుని వృత్తాంతం, అంధకాసురుని కథ, శివుని విల్లు నిర్వీర్యం అయిన కథ, బాణాసురకథ, గంగావతరణవృత్తాంతం, బ్రహ్మ శివునకు పేరు పెట్టిన వృత్తాంతం, శివుడు స్వయంగా చెప్పిన వృత్తాంతం, అంబరీషునివల్ల కల్గిన భయం, భృగుమునిశాపం మొదలైనవానివల్ల శివుడు నారాయణునకు (నీకు) పరతంత్రుడని తెలిసినవారికి ఈ లోకంలో శరణు పొందడానికి నీవు తప్ప ఇంక వేరెవరున్నారు?

దీప ప్రకాశ స్వామీ! నీకు, శివునకు మధ్య ఉండే తారతమ్యాన్ని గమనించి చూచే అవకాశమే లేదు. అన్ని విధాలుగాను అతడు నీకు అణగి ఉండేవాడే. ఈ వాస్తవాన్ని ఈ క్రింద ప్రస్తావింపబడే వృత్తాంతాలతో విజ్ఞులు చక్కగా తెలుసుకుంటున్నారు. వారు నిన్ను తప్ప వేరు ఎవరిని శరణంగా పొందడం సాధ్యం అవుతుంది?

**ఈ శ్లోకంలో ప్రస్తావింపబడిన వృత్తాంతాలు ఏవి ?అంటే,**

1) కాశిలో జరిగిన యుద్ధం, 2)వృకాసురుని వృత్తాంతం, 3)అంధకాసురుని చరిత్ర, 4)శివుని విల్లు, 5) బాణాసురుని చరిత్ర, 6) గంగ ఉద్భవించిన విధానం, 7) శివుని జన్మ, పేరు పెట్టడం, దంపతులతో సంభాషణం, తండ్రికి, కుమారునకు జరిగిన సంభాషణం మొదలైనవి, 8) శివుడు తానే పలికిన మాట, 9)అంబరీషుని వల్ల కలిగిన భయం, 10)భృగుముని శాపం మొదలైనవి.

1) కాశీలో జరిగిన యుద్ధం –

పౌండ్రకుడు అనే ఒక అసురుడు శంఖ చక్రాలను ధరించి, శ్రీకృష్ణునివలే వేషాన్ని ధరించి, తానే వాసుదేవుడనని చెప్పుకుంటూ సంచరించాడు. శ్రీకృష్ణుడు సుదర్శన చక్రంతో అతనిని వధించాడు. ఆ చక్రాయుధం అతనికి సహాయంగా వచ్చిన కాశీ రాజును వధించి, అతని తలను కాశీలో పడగొట్టింది. దానివల్ల చాలా కోపించిన కాశీరాజు పుత్రుడు శివుని గూర్చి తపస్సు చేసి, అతని అనుగ్రహించేత ఒక భూతాన్ని సహాయంగా చేసుకుని ద్వారకను దహించాలని ప్రయత్నం చేశాడు. శ్రీకృష్ణుని సుదర్శన చక్రం ఆ భూతాన్ని తరిమి కొట్టగా, అది సహించని భూతం కాశీరాజు కుమారుని వధించి వేసింది. సుదర్శన చక్రం కాశీ నగరాన్ని దహించి తిరిగి వచ్చింది. ఈ విధంగా శివుని శక్తి వ్యర్థమైపోయింది.

2) వృకాసురుని వృత్తాంతం –

వృకాసురుడు అనేవాడు శివుని గూర్చి తపస్సు చేసి, తన చేతిని ఎవరి తలపై పెడతాడో, వారు నశించిపోయేటట్లు ఒక వరాన్ని శివుని వల్ల పొందాడు. తాను పొందిన వరాన్ని పరీక్షించాలని తలచి, అతడు వరం ఇచ్చిన శివుని తల పైననే తన చేతిని పెట్టడానికి ప్రయత్నించగా, శివుడు భయపడి పరిగెత్తడం ఆరంభించాడు. ఆ విధంగా అతడు పరిగెత్తి భగవంతుని దగ్గరకు పోయి శరణు పొందాడు. భగవంతుడు ఆ అసురుని పిలచి, శివుడు ఇచ్చిన వరం అసత్యమని, మొదట తన తలపైననే చేతిని పెట్టుకుని చూస్తే, నిజం తెలుస్తుందని అన్నాడు. ఏమాత్రం జ్ఞానం లేని, ఆలోచన లేని అసురుడు భగవంతుడు చెప్పినట్లుగా తన చేతిని తన తల పైన పెట్టుకుని నశించాడు. శివుని భయం తీరిపోయినది.

3) అంధకాసురుని కథ–

అంధకుడు అనే ఒక అసురుని శివుడు యుద్ధం చేసేటప్పుడు తన ఆయుధంతో వధించాడు. అప్పుడు అతని శరీరం నుండి రక్తబిందువులు చిందగా, వాటి నుండి చాలామంది అసురులు పుట్టి శివుని ఎదురించారు. శివుడు భయపడి భగవంతుని దగ్గరకు పోయి, శరణు పొందాడు. భగవంతుడు ఒక క్రిమిని సృష్టించగా అది అసరుని రక్తాన్ని తాగి వేసింది. శివుని భయం అంతటితో తీరిపోయింది. భగవంతునకు అతడు నమస్కరించి వెళ్లిపోయాడు.

4) శివుని విల్లు వృత్తాంతం –

విశ్వకర్మ పూర్వం ఒకానొక సమయంలో రెండు విధాలైన ధనుస్సులను తయారు చేశాడు. ఒక ధనుస్సును శివునకు ఇచ్చాడు. ఇంకొక ధనుస్సును విష్ణువు స్వీకరించాడు. ఈ రెండిటిలో ఏది గొప్పది? అని తెలుసుకోవాలని ప్రయత్నించిన బ్రహ్మ విష్ణువునకు మధ్య ఒక పోటీని ఏర్పాటు చేశాడు. ఆ పోరాటంలో భగవంతుడు హుంకరించగా, దానివల్ల శివుని విల్లు నిర్వీర్యమైపోయింది. శివుడు మోహాన్ని పొందాడు. దేవతలు భగవంతుడే గొప్పవాడని తెలుసుకున్నారు.

5) బాణాసురుని వృత్తాంతం–

బాణాసురుని కుమార్తె అయిన ఉషాదేవి శ్రీకృష్ణుని మనుమడు అయిన అనిరుద్ధునిపై ప్రేమను కలిగినదై, అతనిని కలవడం కోసం తన చెలికత్తె అయిన చిత్రలేఖ సహాయం కోరింది. చిత్రలేఖ తన యోగ శక్తితో అనిరుద్ధుని తీసుకుని వచ్చి ఉషాదేవి సమీపంలో విడచి పెట్టింది. ఉషాదేవి, అనిరుద్ధుడు ఇద్దరూ కలసి ఆనందంగా కాలం గడపసాగారు. ఈ విషయాన్ని తెలిసికొన్న బాణాసురుడు అనిరుద్ధునితో యుద్ధం చేశాడు. అనిరుద్ధుని బలానికి ముందు నిలువ లేని బాణుడు మాయతో నాగాస్త్రాన్ని ప్రయోగించి, అనిరుద్ధుని బంధించాడు ఈ విషయాన్ని నారదుని ద్వారా తెలుసుకున్న శ్రీకృష్ణుడు బాణుని గ్రహించడం

కోసం తన పరివారంతో పాటు అతని నగరం పైకి దండెత్తాడు. యుద్ధంలో బాణునకు సహాయంగా వచ్చిన శివుడు తన పరివారాలను ఉపయోగించాడు. వారు సఫలం కాకపోగా, తరువాత తానే తన పుత్రులతో పాటు అక్కడకు వచ్చాడు. శ్రీకృష్ణుడు వారిని అందరిని తరిమి కొట్టాడు. తన చక్రాయుధంతో బాణుని వేయి బాహువులను ఖండించి వేశాడు. ఈ విధంగా అపజయాన్ని పొందిన శివుని ప్రార్థనను అనుసరించి, బాణుని ప్రాణాలను, రెండు చేతులను మాత్రం శ్రీకృష్ణుడు విడచి పెట్టాడు. దీనివల్ల శివుడు భగవంతునకు లోబడి ఉండేవాడు – అని తెలుస్తుంది.

6) గంగ వత్తాంతం–

బలి చక్రవర్తి దగ్గరకు వామనుడై వెళ్లి, మూడు అడుగుల నేలను దానంగా పొంది, భగవంతుడు త్రివిక్రమ రూపాన్ని ధరించి తన పాదాన్ని ఈ లోకాలలోకి వ్యాపింప చేయగా, అది బ్రహ్మలోకం వరకు వ్యాపించింది. ఆ పాదానికి బ్రహ్మ తన కమండలులోని తీర్థంతో అభిషేకం చేశాడు. ఆ జలమే గంగానదిగా మారి ప్రవహించింది. దానిని శివుడు తన తలపై ధరించాడు.

7) వేదాలలోను, స్మృతి పురాణాలలోనూ, శివునకు బ్రహ్మ వల్ల జన్మ కలిగినట్లు, బ్రహ్మయే అతనికి పేరు పెట్టినట్లు తెలుస్తుంది. బ్రహ్మకు శివునకు మధ్య జరిగిన సంభాషణ వల్ల కూడా భగవంతుడే అన్నిటినీ సృష్టించినవాడు అనేది వ్యక్తం అవుతున్నది.

8) పార్వతితోను, మిగిలినవారితోనూ శివుడే తన నోటితో స్వయంగా నారాయణుడే పరదేవత అనే విషయాన్ని పలుమార్లు పలికాడు.

9) అంబరీషునివద్ద భయం–

భగవంతుడైన శ్రీమన్నారాయణుని విషయంలో చాలా భక్తిని కలిగినవాడై, ఏకాదశి ఉపవాసాన్ని ఆచరిస్తూ వచ్చిన అంబరీషుడు అనే రాజు దగ్గరకు దుర్వాసమహర్షి ఒక ద్వాదశి నాడు ఉదయ కాలంలో వచ్చాడు. ఆ మునిని వేగంగా స్నానం చేసి పారణకు రమ్మని ఆ ప్రభువు ప్రార్థించాడు. ఆ ముని పారణకు సకాలంలో రాకుండా ఉన్నందున, శాస్త్రక్రమానుసారంగా జలాన్ని స్వీకరించి అంబరీషుడు పారణను ముగించాడు. దుర్వాస మహర్షి రాక కోసం ఎదురుచూశాడు. ఆ ముని వచ్చి ముందుగానే రాజు జలాన్ని తాగి పారణ ముగించాడని తెలుసుకొని, చాలా కోపంతో తన జటలలో ఒక జటను పీకి, దాని నుండి ఒక భూతాన్ని సృష్టించి, ఆ భూతాన్ని రాజు పైకి పంపాడు. అంబరీషుడు ఏమీ భయపడకుండా, భగవంతుని ప్రార్థించగా, భగవంతుడు తన చక్రాయుధాన్ని ఆ ముని పైకి పంపాడు. ఆ ఆయుధాన్ని చూసి భయపడిన ముని మొదట బ్రహ్మను, తరువాత శివుని తాఏనను కాపాడమని ప్రార్థించాడు. వారు అతనిని రక్షించడం సాధ్యం కాదని తెలుసుకొని ఆ మహర్షి భగవంతుని శరణు పొందాడు. భగవంతుడు అంబరీషునీ దగ్గరకు వెళ్లి ప్రార్థించమని అతనితో చెప్పాడు. ఆ ముని కూడా ఆ విధంగానే అంబరీషునీ దగ్గరకు వచ్చి, తన అపరాధాన్ని సహించమని కోరాడు. అంబరీషుడు చక్రాయుధాన్ని ప్రార్థించగా, అది తిరిగి వెళ్ళిపోయింది. ఈ విధంగా అంబరీషుని వల్ల దుర్వాసమహర్షికి కలిగిన భయాన్ని తీర్చడం శివుని వల్ల సాధ్యం కాలేదు. దీని వల్ల కూడా భగవంతుడే శివుని కంటే గొప్పవాడు— అని తెలుస్తున్నది.

10) భృగుమహర్షిశాపవృత్తాంతం—

బ్రహ్మ, శివుడు, భగవంతుడు— ఈ అనే ముగ్గురిలో పరదేవత ఎవరు? అని నిశ్చయించాలని ఒక పర్యాయం భృగుమహర్షి బ్రహ్మ దగ్గరకు వచ్చాడు. కానీ, బ్రహ్మ అతని రాకను గమనించలేదు. ఆ ముని అతనికి పూజ, ఆలయం లేకుండా పోవాలని శపించి, శివుని దగ్గరకు వెళ్ళాడు పార్వతితో సంతోషంగా

ఉన్న శివుడు అతనిని గమనించి ఆదరించలేదు. అతనిని కూడా మగతనం కోల్పోయేటట్లుగా మహర్షి శపించాడు. అప్పుడు శివుడు కోపంతో తన ఫాలనేత్రాన్ని తెరువగా, ముని కూడా తన పాదంలో ఉండే ఒక వేలు నుండి అగ్నిని సృష్టించి, శివుని ఫాలనేత్రం పుట్టిన అగ్నిని అణచివేశాడు. తరువాత పాల సముద్రాన్ని చేరి, తన రాకను గుర్తించకుండా ఉన్నందున చాలా కోపంతో అక్కడ యోగనిద్రలో ఉన్న భగవంతుని వక్షస్సుపై తన పాదంతో భృగుమహర్షి తన్నాడు. వెంటనే కన్నులు తెరచి భగవంతుడు చూచి, మునితో తన తప్పును సహించమని కోరి, అతని పాదం పడినందున తనను భాగ్యం కలిగినవానినిగా పలికి, ఆ మునిని చక్కగా ఉపచరించాడు. అప్పుడు భృగుమహర్షి శ్రీమన్నారాయణుడే పరదేవత అని నిశ్చయించి, మహర్షులకు, దేవతలకు ఆ యథార్థాన్ని తెలియజేశాడు. ఇటువంటి, ఇంకా పలు విధాలైన వృత్తాంతాల వల్ల కూడా శ్రీమన్నారాయణుడే పరదైవం అని నిశ్చయించటానికి సాధ్యం అవుతున్నది.

# ప్రాకృత శరీరం –అప్రాకృత శరీరం

ఈ లోకంలో మనం జీవించేటప్పుడు ఇప్పుడు మనం ఒక విధమైన శరీరంతో ఉన్నాము. దీనికి ప్రాకృత శరీరం అనే పేరు. అయితే, ఏదో ఒకనాడు, మనకు సదాచార్య సంబంధం వల్ల, భగవంతుని అనుగ్రహం వల్ల ముక్తి లభించి, వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది. అక్కడ ఆ లోకంలో మనకు చాలా విలక్షణమైన అపాకృత శరీరం లభిస్తుంది అని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ విధంగా రెండు విధాలుగా ఉండే ప్రాకృత, అప్రాకృత శరీరాల మధ్య ఏమి తేడాలు ఉన్నాయి? ఇక్కడ ఉన్నట్టుగానే కన్ను, ముక్కు, చెవులు అనే విధంగానే ఆ శరీరం కూడా ఉంటుందా? లేక, ఆ శరీరం వేరు విధంగా ఉంటుందా? ఈ రెండిటి మధ్య తేడాలు ఏమైనా ఉన్నాయా? అని అంటే, ఈ విధంగా ఉండే ప్రాకృత, అప్రాకృత శరీరాల మధ్య ఉండే 8 విధాలైన తేడాలను మన పూర్వాచార్యులు చాలా స్పష్టంగా తెలియజేశారు. వాటిని గూర్చి సంగ్రహంగా గమనిద్దాం.

1) ఇప్పుడు మనం నివసించే ఈ లోకం ప్రాకృతలోకం. అంటే, ప్రకృతి అనబడే పంచభూతాలతో కూడినది. భూమి, ఆకాశం, నీరు, నిప్పు, వాయువు అనే ఐదు భూతాల సమ్మేళనం వల్ల ఇది ఏర్పడినది. ఇక్కడ మనకు ఉండే శరీరం కూడా ఇటువంటి ఐదు భూతాల వల్ల ఏర్పడినదే. అయితే, పరమపదానికి వెళ్ళిన తరువాత మనకు అప్రాకృతమైన శరీరం లభిస్తుంది. అది ఈ విధంగా ఉండే పంచభూతాలతో ఏర్పడేది కాదు. అక్కడ కూడా భూమి, నీరు, ఆకాశం, వాయువు, అగ్ని ఉంటాయి. అయితే, అవి ప్రకృతి చేత ఏర్పడినవి కావు. అప్రాకృతమైనవి. ఇది మొదటి భేదం.

2) ఇక, రెండవ తేడా ఏమంటే, ఇక్కడ ఉండే ప్రాకృత శరీరం సత్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలతో కూడినదై ఉంటుంది. కానీ, వైకుంఠంలో మనకు లభించే ఆ రూపం కేవలం సత్వమయంగానే ఉంటుంది.

దానిలో రజోగుణతమోగుణాల స్పర్శ లేశం కూడా ఉండదు. దీనివల్ల ఏమి అతిశయం అంటే, ఈ కారణం వల్ల జ్ఞానం స్పష్టంగా ప్రకాశిస్తుంది.

3) ఈ లోకంలో మనకు కల ప్రాకృత శరీరం రక్తం, మాంసం, చీము, కొవ్వు, ఎముకలు, చర్మం మొదలైనవానితో నిర్మింపబడి ఉంటుంది. కానీ వైకుంఠంలో మనకు లభించే శరీరం ఈ విధమైన మలినాలతో కూడినది కాదు. ఐదు ఉపనిషత్తులతో కూడినదై, పరిశుద్ధమై ఉంటుంది. ఆ శరీరంలో ఇక్కడ ఉన్నట్లుగా చీము, రక్తం, మాంసం, తోలు మొదలైనవి ఉండవు.

4) ఇప్పుడు మనకు కల శరీరం ఎల్లప్పుడూ మార్పును చెందుతూనే ఉంటుంది. బాల్యం, కౌమారం, యవ్వనం, వార్ధక్యం అని ఈ విధంగా వివిధ దశలను ఇది పొందుతూ ఉంటుంది. దీనికి ప్రతి క్షణం పరిణామం ఉంటుంది. కానీ, అక్కడ ఉండే దివ్యశరీరానికి ఏ క్షణంలోనూ, ఏ విధమైన మార్పు ఉండదు. శిశువై ఉన్నాడు, బాలుడై ఉన్నాడు, యువకుడై ఉన్నాడు, ముసలివాడయ్యాడు —అని ఈ విధమైన మార్పులు ఏమి ఆ శరీరానికి ఉండవు. పరిణామానికి అవకాశం ఏమీ లేదు.

5) ఈ లోకంలోని శరీరం మనం చేసుకున్న కర్మల వల్ల లభిస్తుంది. కర్మల ఫలంగా ఈ శరీరం మనకు లభిస్తున్నది. అందుచేత ఇది అనేక విధాలైన హెచ్చుతగ్గులను కలిగి ఉంటుంది. పుణ్యం చేసినవారికి ఉన్నతమైన శరీరం, పాపం చేసినవారికి నీచమైన శరీరం లభిస్తుంది. వీటిలో కూడా, వారు వారు చేసుకున్న పుణ్యంలో ఉండే తేడాలను బట్టి, పాపాలలో ఉండే తేడాలను బట్టి కూడా వారి శరీరాలలో తేడాలు ఏర్పడతాయి. కానీ, వైకుంఠంలో మనకు లభించే శరీరం పరమాత్మ అనుగ్రహం వల్ల ఏర్పడుతుంది. ఆ కృప ఒకే విధంగా ఉంటుంది కనుక అక్కడ ఉండే శరీరాలు కూడా ఒకే విధంగా ఉంటాయి.

అందుచేత, ఈ లోకంలో ఉండే శరీరం కర్మ వల్ల ఏర్పడుతుంది, వైకుంఠంలోని శరీరం భగవంతుని కృప వల్ల లభిస్తుంది.

6) ఇక ఆరవ తేడా ఏమంటే, ఈ శరీరం మన స్వాధీనంలో ఉండదు. నిద్రించేటప్పుడు, మైకం వచ్చినప్పుడే కాదు. మెలకువలో ఉన్నప్పుడు కూడా మనకు ఈ శరీరం పూర్తిగా స్వాధీనంలో ఉన్నదని చెప్పలేము. వయస్సులో ఉన్నప్పుడు ఏదో మనకు మన అధీనంలో ఉన్నట్టు తోస్తుంది, అంతే. కానీ, వాస్తవంలో పూర్తిగా మన అధీనంలో ఉండదు. మనం కోరుకున్న రీతిలో అది ఉండదు. అందుచేత ఇది మనకు స్వాధీనంలో ఉండి, మనం చెప్పినట్లు మనకు ఇష్టం వచ్చినట్లుగా ఉండదు. కానీ, వైకుంఠంలో ఉండే శరీరం స్వాధీనమై ఉంటుంది. మనం కోరుకున్న రీతిలో ఉంటుంది. అందుచేత, ఈ లోకంలోని శరీరం అస్వాధీనమైనది. పరమపదంలోని శరీరం స్వాధీనమై ఉండేది.

7) ఇక, తరువాత భేదం ఏమంటే, ఈ లోకంలోని శరీరం నిద్ర, మైకం మొదలైనవాని వల్ల తేడాలను పొందుతుంది. ఈ ఆత్మ ఎటువంటిది? పరమాత్మ ఎటువంటివాడు? అనే జ్ఞానాన్ని కలుగనీయకుండా అడ్డుపడుతుంది. యథార్థమైన జ్ఞానాన్ని ఇది ఆవరిస్తుంది. తత్వజ్ఞానం కలుగనీయకుండా అడ్డుపడుతుంది. ఈ లోకంలోని సుఖాలను అనుభవించాలని మాత్రం ఆశపడుతుంది. దానికి సదా సిద్ధంగా ఉంటుంది. ఆత్మ, పరమాత్మల జ్ఞానాన్ని తెలుసుకోవడంలో మాత్రం అడ్డుపడుతుంది. అయితే, పరమపదంలో ఉండే రూపం అటువంటిది కాదు. మన స్వరూపాన్ని చక్కగా ప్రకాశింప చేస్తుంది. ఆత్మ ఎటువంటి వాడు?పరమాత్మ ఎటువంటివాడు? ఈ ఇద్దరికీ మధ్య ఉండే తేడాలు ఏమి? అనే విషయాన్ని చక్కగా తెలుసుకునేటట్లు చేస్తుంది. మనం పరమాత్మకు దాసభూతులం, ఆయనకే ఉపయోగపడవలసినవారం, ఆ స్వామి

సేవే మనకు నిత్యం కర్తవ్యం— అనే ఈ విధమైన విషయాలను స్పష్టంగా తెలిసికొనేటట్లు చేస్తుంది.

8) ఇక, చివరిగా ఉండే ఎనిమిదవ తేడా ఏమంటే, ఈ లోకంలో ఉండే శరీరం దుఃఖాన్ని అనుభవించడానికి సాధనమై ఉంటుంది. ఒకనాడు సుఖాన్ని అనుభవిస్తే నాలుగు దినాలు దుఃఖం అనుభవించవలసి ఉంటుంది. ఒకరోజు సంతోషంగా ఉంటే, పది రోజులు దుఃఖపడవలసి వస్తుంది, ఒకరోజు నవ్వితే, పది రోజులు ఏడవవలసి ఉంటుంది. ఈ విధంగా ఇక్కడ ఉండే శరీరం సుఖదుఃఖాల అనుభవానికి సాధనమై ఉంటుంది. అందులోనూ సుఖం కంటే, దుఃఖమే అధికంగా ఉంటుంది. కానీ, పరమపదానికి వెళ్ళినప్పుడు మనకు లభించే శరీరం కేవలం ఆనందాన్ని అనుభవించడానికి మాత్రం సాధనమై ఉంటుంది. భగవంతునకు, మనకు స్వరూపానికి తగిన సేవను చేసి, దానివల్ల ఏర్పడే ఆనందాన్ని అనుభవించడానికి సాధనమై ఉంటుంది. అందుచేత ఈ లోకంలోని శరీరం ముఖ్యంగా దుఃఖానికి సాధనమై ఉండగా, పరమపదంలోని శరీరం భగవంతునకు సేవను చేసినందు వల్ల ఏర్పడే ఆనందానికి సాధనమై ఉంటుంది.

ఈ విధంగా 8 విధాలైన తేడాలు ఇక్కడ మనకు గల శరీరానికి, పరమపదానికి వెళ్ళినప్పుడు మనకు లభించే శరీరానికి మధ్య ఉన్నాయి. ఈ శరీరం ప్రాకృతమైనది, ఆ శరీరం అప్రకృతమైనది. ఈ శరీరం త్రిగుణాత్మకమైనది, అది సత్వగుణాత్మకమైనది. ఈ శరీరం రక్తం, చీము మొదలైన పదార్థాలతో కూడినదై ఉంటుంది. ఆ శరీరం ఇటువంటి దోషాలతో కూడినది కాకుండా, ఐదు ఉపనిషత్తులతో ఏర్పడినదిగా ఉంటుంది. ఈ లోకంలోని శరీరం ఎల్లప్పుడూ మారుతూనే ఉంటుంది. ఆ శరీరానికి ఏ సమయంలోనూ ఎటువంటి మార్పు ఉండదు. ఈ లోకంలోని శరీరం మన కర్మల వల్ల ఏర్పడుతుంది. ఆ లోకంలోని శరీరం భగవంతుని కరుణ వల్ల ఏర్పడుతుంది. ఈ శరీరం మన స్వాధీనంలో

ఉండదు. ఆ శరీరం మన స్వాధీనంలో ఉంటుంది. ఇది ఆత్మస్వరూప, పరమాత్మ స్వరూపాలను ప్రకాశింప చేసేదిగా ఉండదు. వాటిని ఆవరిస్తుంది. కానీ, ఆ లోకంలోని శరీరం ఈ జ్ఞానాలను పరిపూర్ణంగా ప్రకాశించేటట్టు చేస్తుంది. చివరిగా, ఈ లోకంలో అనే శరీరం దుఃఖాన్ని అనుభవించడానికి మాత్రం సాధనమై ఉండగా, ఆ శరీరం భగవంతునకు కైంకర్యం చేసినందున కలిగే ఆనందాన్ని అనుభవించే సాధనమై ఉంటుంది.

ఇటువంటి విలక్షణమైన శరీరం, మనకు, ఈ లోకం నుండి విడుదలను పొందిన తరువాత, సదాచార్య సంబంధం వల్ల, భగవంతుని నిర్హేతుక కృప వల్ల తప్పక లభిస్తుంది. మనం ధైర్యంగా గుండెల మీద చేయి వేసుకుని ఉందాం. స్వస్తి.

# దశరథునకు మోక్షం ఎందుకు లభించలేదు?

ఒక కుటుంబంలో ఒక బ్రహ్మజ్ఞాని జన్మించినట్లయితే, ఆ మహానుభావునకు ముందు, తరువాత జన్మించిన ఏడు ఏడు తరాలవారు ముక్తిని పొందుతారు— అని శాస్త్రాలు చెబుతున్నాయి. ఆ బ్రహ్మజ్ఞానికి తరువాత పుట్టినవారే కాదు, అతనికి ముందు జన్మించి మరణించినవారు కూడా ఆ బ్రహ్మజ్ఞాని ప్రభావంచేత ముక్తిని పొందుతున్నారు— అని చెప్పబడుతున్నది. వారే కాదు, పితృలోకంలో ఉండే పితరులు, పితామహులు సైతం ఆ బ్రహ్మజ్ఞాని సంబంధం వల్ల తమకు అతిశయం కలుగుతుందని, మోక్షం లభిస్తుందని ఆనందంతో గంతులు వేస్తారట. "ఆస్ఫోటయంతి పితరః ప్రనృత్యంతి పితామహాః, వైష్ణవో నః కులే జాతః స నః సంతారయిష్యతి" – (మన కుటుంబంలో ఒక వైష్ణవుడు పుట్టాడు, అతడు మనలను తరింప చేస్తాడు— అని పితృదేవతలు ఆనందంతో చప్పట్లు చరుస్తారు గొప్పగా పితామహులు నాట్యం చేస్తారు) అనేది సూక్తి.

వస్తుస్థితి ఈ విధంగా ఉండగా, మరి, దశరథునకు ఎందుకు మోక్షం లభించలేదు? బ్రహ్మజ్ఞాని కాదు, సాక్షాత్తు పరబ్రహ్మమే దశథునకు పుత్రుడుగా జన్మించాడు కదా. అటువంటి అతిశయాన్ని కలిగిన దశరథుడు ఎందుకు మోక్షాన్ని పొందలేకపోయాడు? అతడు మోక్షాన్ని పొందలేదా? అంటే శ్రీరామాయణంలో దశరథుడు మోక్షాన్ని చేరినట్లు చెప్పబడలేదు. స్వర్గాన్ని పొందినట్లే చెప్పబడినద్ిఈ విధంగా దశరథుడు ఎందుకు మోక్షాన్ని పొందలేదు? అనే బలమైన సందేహం ఎవరికైనా కలుగుతుంది. పరమాత్మ స్వరూపి అయిన శ్రీరాముని కుమారునిగా పొందిన తరువాత కూడా, దశరథుడు ఎందుకు మోక్షాన్ని చేరలేదు? స్వర్గానికి అతడు ఎందుకు పోవలసి వచ్చింది? అనేది ఇక్కడ ప్రశ్న. నిజమే. ఇది ఎవరికైనా కలిగే సందేహమే. సహేతుకమైన ప్రశ్నయే. అయితే, దీనికి సమాధానాన్ని రెండు విధాలుగా భావించే అవకాశం ఉన్నది.

మొదటి సమాధానం ఏమంటే—

ఒక బ్రహ్మజ్ఞాని జన్మిస్తే, ఆ బ్రహ్మజ్ఞాని సంబంధం వల్ల అతనికి ముందు వెనుకలలో ఉండేవారు పలువురు మోక్షాన్ని పొందుతారు— అని చెప్పబడింది తప్ప, సాక్షాత్తు బ్రహ్మమే పుట్టినప్పటికీ మోక్షాన్ని పొందే అవకాశం ఉన్నది— అని ఎక్కడా చెప్పబడలేదు కదా. శ్రీరాముడు భక్తుడు కాదు కదా పరమాత్మ స్వరూపి. ఒక జ్ఞాని, బ్రహ్మజ్ఞాని జన్మిస్తున్నాడంటే, అతడు కర్మ వల్ల జన్మిస్తున్నాడు. అతడు తనకు తగిన ప్రయత్నాన్ని చేసి, భక్తిని, బ్రహ్మజ్ఞానాన్ని పొందుతున్నాడు. భగవంతుని అనుగ్రహాన్ని ఎదురు చూస్తాడు— అనే ఈ విషయాలు అన్నీ ఉన్నాయి. సరే. అయితే, భగవంతుని పుత్రునిగా పొందితే, భగవంతుని పుత్రునిగా పొందాడు అనే అతిశయం మాత్రమే ఉంటుంది. అంతే. శ్రీరాముడు పరబ్రహ్మమే కావచ్చు. కానీ, అతడు భక్తుడు కాదు కదా. భగవంతుని విషయంలో భక్తిని కలిగిన బ్రహ్మజ్ఞాని జన్మిస్తేనే మోక్షమని కదా చెప్పబడింది. అందుచేత దశరథుడు మోక్షాన్ని పొందలేకపోయాడు— అనేది ఒక విధమైన సమాధానం.

సరే, ఆ విధంగానే ఒప్పుకుందాం. భగవద్భక్తుడు పుడితేనే, అతని సంబంధంవల్ల అతనికి ముందు వెనుకలలో ఉండేవారికి మోక్షం లభిస్తే, సాక్షాత్తు ఆ భగవంతుడే జన్మిస్తే మోక్షంభవించకూడదా? అనే ప్రశ్న మళ్ళీ కలుగక మానదు. ఆ ప్రశ్నను అడగవచ్చు కూడా. అప్పుడు, ఈ రెండవ సమాధానాన్ని భావించవచ్చు.

ఎటువంటి అతిశయాన్ని, మహిమను కలిగినవారు పుట్టినప్పటికీకూడా, అతని సంబంధం వల్ల మాత్రమే మోక్షం తప్పక లభిస్తుంది— అని చెప్పలేము. మోక్షాన్ని పొందాలి— అనే కోరిక కూడా మోక్షం పొందడానికి ఆవశ్యకమై ఉన్నది. అది ఉండాలి. ఇది పురుషార్థం కదా.

అర్థించినప్పుడు కదా పురుషార్థం అవుతుంది. అందుచేత, మోక్షాన్ని పొందాలి— అనే కోరిక కూడా తప్పకుండా ఉండాలి. దశరథునకు ఆ కోరిక లేదు. అందుచేత అతడు మోక్షాన్ని పొందలేకపోయాడు.

మరి, భగవంతుడు మనకు మోక్షాన్ని ఇవ్వాలని కోరుకుంటున్నాడా? అని ప్రశ్నిస్తే, అతడు ఎల్లప్పుడూ మనకు ఆ పరమపురుషార్థాన్ని ఇవ్వడానికి సంసిద్ధమై ఉన్నాడు. కానీ, మనకే ఆ కోరిక కలగడం లేదు. అందుచేత మనం మోక్షాన్ని పొందలేకపోతున్నాము తప్ప, భగవంతునకు మోక్షాన్ని ఇవ్వాలి అనే అభిప్రాయం లేకపోవడం వల్ల మాత్రం కాదు. ఎప్పుడు మనం మోక్షానికి పోయే అవకాశం ఉన్నది? అని అంటే, ఎప్పుడు మనకు మోక్షాన్ని పొందాలని ఆశ అపేక్ష ఉంటుందో, అప్పుడే ఆ భగవంతుడు మనకు మోక్షాన్ని అనుగ్రహిస్తాడు. ఆ విధంగా కోరకపోతే అతడు ఇవ్వడు. ఇవ్వలేడు కూడా. అడుగకపోయినా అందరికీ మోక్షాన్ని భగవంతుడు ఇచ్చేవాడైతే, సర్వముక్తి ప్రసంగం ఏర్పడుతుంది కదా.

దశరథునకు మోక్షానికి పోవాలనే ఇచ్ఛ లేదు. స్వర్గానికి పోవాలని మాత్రమే కోరిక అతనికి ఉన్నది. అందుచేత అతడు స్వర్గానికి పోయాడు తప్ప, మోక్షాన్ని పొందలేదు.

అదేమి? అతడు సత్యసంధుడు కదా. 60 వేల సంవత్సరాలు ధర్మబద్ధంగా రాజ్యం చేసినవాడు కదా. నీతి నియమాలను తప్పనివాడు కదా. అటువంటి దశరథునకు మోక్షాన్ని పోవాలని ఇచ్ఛ కలుగకుండా ఉంటుందా? అని ప్రశ్నిస్తే, ధర్మబద్ధంగా నడచుకున్నవారికి అందరికీ మోక్షానికి పోవాలనే కోరిక తప్పకుండా కలగాలి— అనే నియమం ఏమీ లేదు కదా. దశరథునకు కూడా

అటువంటి ఇచ్ఛ కలిగి ఉండకపోవచ్చు. అందుచేత అతడు మోక్షాన్ని చేరలేకపోయాడు.

దశరథుడు ఎల్లప్పుడూ సత్యాన్ని పలుకేవాడై, ధర్మాన్ని మీరనివాడై, చెప్పిన మాటను దాటనివాడై ఉండవచ్చు కానీ, అతడు శ్రీరాముని వనవాస సందర్భంగా ఏమని చెప్పి ఉండాలి? వాస్తవంగా భగవంతుని సన్నిధికి చేరాలి– అని అతడు కోరుకునే ఉంటే, శ్రీరాముడే కావాలి అని కోరుకుంటే ఏమని పలికి ఉండాలి? నేను నరకానికి పోయినా సరే, సత్యాన్ని తప్పినవాడను అయినా సరే, నేను శ్రీరాముని వనవాసం చేయడానికి ఒప్పుకోను– అని చెప్పి ఉండాలి. అంతటి అవధిలో అతనికి భగవంతుడైన శ్రీరాముని విషయంలో భక్తి, అపేక్ష ఉండి ఉండాలి. అప్పుడే అతడు మోక్షానికి చేరగలిగి ఉండేవాడు. "కైకేయీ! శ్రీరాముని వనవాసం తప్ప ఇక ఏదైనా నీవు కోరుకో. ఆ విధంగా కాదు శ్రీరాముడు వనవాసం పోవాలి– అని నీవు అంటే, నేను అబద్ధాలకోరు అయినా పరవాలేదు మాటను తప్పిన వాడను అయినా ఇబ్బంది లేదు. నేను మాత్రం శ్రీరాముడు వనవాసం పోవడానికి ఇష్టపడను. నీ వరానికి నేను సమ్మతించను" అని అతడు చెప్పి ఉండాలి. అప్పుడే పరమాత్మ అయిన శ్రీరాముని విషయంలో అతనికి అంతటి అపేక్ష, భక్తి ఉన్నదని అర్థం.

శ్రీరాముని విషయంలో అతనికి గల ప్రేమ తక్కువా? ఎంతో ప్రేమ కలిగి ఉంటే కదా, శ్రీరాముడు తనను విడిచి వెళ్లిన వెంటనే అతడు మరణించాడు– అని అనవచ్చు. కానీ, దశరథునకు శ్రీరాముని విషయంలో ప్రేమ ఉన్న మాట వాస్తవమే. కాని, అది పుత్రప్రేమ తప్ప, భగవద్విషయంలో ఉండవలసిన భక్తి కానీ, అపేక్ష గాని కాదు. కేవలం పుత్ర ప్రేమను ఆధారంగా చేసుకుని మోక్షాన్ని పొందే అవకాశం లేదు. ఒక భక్తుడు భగవంతుని మీద కలిగి ఉండవలసిన భక్తి దశరథునకు శ్రీరామునిపై ఉండి ఉండాలి. అప్పుడే అతనికి ముక్తి లభించి

ఉంటుంది. దశరథుడు ఒకే మాటను చెప్పి ఉండాలి "నేను నరకాన్ని చేరినా సరే, నేను అసత్యవాదిని అయినా సరే, శ్రీరాముని తిరుమేనికి శ్రమ కలగడానికి నేను ఒప్పుకోను" అని దశరథుడు చెప్పి ఉండాలి. ఆ విధంగా దశరథుడు చెప్పి ఉంటే, అతడు మోక్షానికి పోయి ఉండేవాడు.

ఇదేమి? ఈ విధంగా సమాధానం చెబుతున్నారు! అని ఇక్కడ తోచవచ్చు. సత్యవాది అయి ఉండడం అపరాధమా? అని తోచవచ్చు. నిజమే. సత్యవాదిగా ఉండవలసినదే. ఆడిన మాటను తప్పకుండా కాపాడుకొనవలసిన ధర్మం ఉన్నది. కానీ, వీటికి అన్నిటికి మించి పరమధర్మ స్వరూపుడైన భగవంతుని యథార్థ స్వరూపాన్ని తెలియగలిగినప్పుడే, మోక్షప్రాప్తి కలుగుతుంది. ఆభాస ధర్మం కంటే, పరమధర్మమైన, మూర్తీభవించిన ధర్మమైన శ్రీరాముడే కావాలి– అనే ఆశ అపేక్ష దశరథునకు లేకుండా పోయింది. అందుచేత, అతడు మోక్షాన్ని పొందలేకపోయాడు.

పై విషయాలను లోతుగా ఆలోచించి చూసినప్పుడు, దశరథుడు మోక్షాన్ని పొందకుండా, స్వర్గాన్ని చేరడం అనేది యుక్తియుక్తంగానే మనకు భాసిస్తుంది.

## సమో ఽ హం సర్వభూతేషు

"నేను జీవితంలో శాంతి లేకుండా తపిస్తున్నాను" అని ఒకరు భావించవచ్చు. "నా జీవితంలో శాంతి లేదు. మనసులో నెమ్మది లేకుండా ఉన్నది" అని భావించవచ్చు. శ్రీకృష్ణుడు భగవద్గీతలో "నన్ను ఈ విధంగా తెలుసుకున్నవాడు శాంతిని పొందుతాడు" అని అన్నాడు. తనను ఎటువంటివానినిగా తెలుసుకున్నవాడు శాంతిని పొందుతాడు –అని శ్రీకృష్ణుడు అన్నాడు అని అంటే భగవంతుడు అందరి విషయంలోనూ సమానంగా ఉంటాడు అందరి విషయంలోనూ సమానంగానే వర్తిస్తాడు అని తెలుసుకున్నవాడు శాంతిని పొందుతాడు అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో అన్నాడు అందరి విషయంలోనూ సమానంగా ఉండడం అనేది చాలా ముఖ్యమైన విషయం అది మనలో కూడా ఉండవచ్చు కానీ, మనలో ఉండే అవధి కంటే భగవంతుని విషయంలో ఈ గుణం ఉండే అవధి అధికంగా ఉంటుంది పరిపూర్ణంగా ఉంటుంది. అందువల్లనే, ఈ విషయాన్ని భగవానుడైన శ్రీకృష్ణుడు భగవద్గీతలో తొమ్మిదవ అధ్యాయంలో "సమో ఽ హం సర్వభూతేషు న మే ద్వేష్యో ఽ స్తి న ప్రియః"– నేను అందరి విషయంలోనూ సమానంగా ఉంటాను నాకు ద్వేషించదగినవాడు కానీ, ప్రియమైనవాడు కానీ, ఎవడు లేడు" అని అన్నాడు. "ఈ విషయాన్ని ఎవడు తెలిసికొని, నా విషయంలో భక్తిని కలిగి ఉంటాడో, అతడు శాంతిని పొందుతాడు" అని భగవానుడు అన్నాడు. ఈ వాస్తవాన్ని ఎవడు తెలుసుకుంటాడో, వాడు నా పట్ల ఉన్నాడు, నేను అతని పట్ల ఉన్నాను" అని అన్నాడు. ఈ తత్వాన్ని గ్రహిస్తే, మనకు జీవితంలో తప్పక శాంతి లభిస్తుంది.

అప్పుడప్పుడు మనకు మనసులో ఒక సందేహం కలుగుతుంది. ఆ సందేహాన్ని ఇతరులు కూడా లేవనెత్తుతారు, లేదా, ఎక్కువ చేస్తారు. అది ఏ సందేహం? ఎటువంటి సందేహం? "భగవంతుడు కొందరి విషయంలో అనుగ్రహంతో ఉన్నాడు ఆ విషయంలో పక్షపాతంతో ఉన్నాడు వారి విషయంలో చూపించినంత కరుణ విషయంలో చూపించడం లేదు వారిని సుఖంగా ఉండేటట్లు చేస్తున్నాడు నన్ను ఈ విధంగా దుఃఖం పొందేటట్లు చేస్తున్నాడు. " అనే ఈ విధమైన భావనమన మనసులో ఏర్పడితే అదే మన మనసులో కలిగే అశాంతికి, అసహనానికి కారణం అవుతుంది.

ఈ విషయాన్ని మనం రెండు కోణాలలో గమనిద్దాం.

"ఇతరులను సుఖంగా ఉండేటట్టు చేసినట్లే, భగవంతుడు నన్ను కూడా సుఖంగా ఉండేటట్లు చేసి ఉండాలి. కానీ, నేను ఈ విధంగా బాధపడడానికి కారణం నేను గతంలో చేసుకున్న కర్మలే!" అనీ భావించి, మనసును సమాధానపరచుకోవచ్చు –అని అంటే, అది మనకు సాధ్యపడాలి ఆ విధంగా మనస్సును మనం దిటవు చేసుకోగలగాలి.

ఈ సంసారంలో ఉండే కొన్ని విషయాలను మనం సరిగా జీర్ణం చేసుకోవడం చాలా కష్టం. మనకు మించిన శక్తి ఒకటి ఉన్నదని, అదే ఈ ప్రపంచాన్ని నిర్వహిస్తున్నదని నమ్మాలి. ఆ భగవంతుని నమ్మి, ఆ స్వామిని ఆశ్రయించి, కాలాన్ని గడపాలి. ఎదురైన కష్టాలను సహించాలి.

ఆ దైవం అందరి విషయంలోనూ సమంగా ఉంటాడని గట్టిగా నమ్మాలి. అయితే, ఇటువంటి దృఢమైన నమ్మికను, విశ్వాసాన్ని, నిబ్బరాన్ని కలిగి ఉండడం చాలా కష్టం.

ఆ విధంగా అయితే, మరి, ఇంక ఎవరిని ఆశయించాలి? ఎవరిని నమ్మి కాలాన్ని గడపాలి?

"అందరి పట్ల సమంగా ఉంటాడని భావించిన ఈ దైవం వల్లనే కదా, నేను ఈ కష్టాలు పడుతున్నాను! మరి, మళ్ళీ అదే దైవాన్ని ఆశ్రయిస్తే, ఇక ఏమి ఉపయోగం ఉన్నది? ఏమి ప్రయోజనం ఉన్నది? నేను బాధపడడానికి కారణమైన ఆ దైవాన్ని నమ్మితే ఏమి ప్రయోజనం ఉంటుంది?"అనే ఈ విధమైన భావన మనకే మన మనసులో మనసులోని దౌర్బల్యం వల్ల కలుగవచ్చు. మనకు జరగవలసిన మంచి జరుగనప్పుడు, అది జరగడంలో ఆలస్యం అయినప్పుడు, ఇటువంటి, మనసులోని ఆందోళన కలుగవచ్చు. లేక, ఎవరైనా వచ్చి, మన మనసులో కలిగించవచ్చు. "దైవం, దైవం అంటూ ఆ దైవాన్ని నమ్ముతున్నావే. ఆ దైవం వల్లనే కదా నీకు ఇంతటి కష్టాలు కడిగాయి. ఆ దైవం నీకు ఏమి చేసింది? అదిగో చూడు! వారు ఎంతో సుఖంగా ఉండేటట్లు చేస్తున్నాడు. నిన్ను మాత్రం ఈ విధంగా కష్టపెడుతున్నాడు. ఇటువంటి దైవాన్ని నమ్మి ఏమి ప్రయోజనం?" అని ఈ విధంగా అంటూ, మన మనసులో సందేహాన్ని, ఆందోళనను కలిగించవచ్చు. దీనివల్ల కూడా మనం మనసులో అశాంతిని పొందవచ్చు.

ఈ విధంగా మనస్సులో సంశయాన్ని, ఆందోళనను పొందినట్లయితే, ఇక, ఎవరు మనలను కాపాడగలరు? అందరినీ కాపాడగలిగిన దైవాన్ని నమ్మడం లేదు. ఆశ్రయించడం లేదు. మనం మనలను స్వయంగా రక్షించుకోగలిగిన సామర్థ్యం కలిగినవారం కాదు భగవంతుని రక్షించమని అడగడం లేదు. ఇక ఎవరు మనలను కాపాడేవారు? మనకు కలిగిన కష్టాలు ఏ విధంగా తీరుతాయి?

ఆ విధంగా మనకు ఏర్పడిన కష్టాలు, సమస్యలు తీరనప్పుడు, మన మనసులో సందేహాన్ని కలిగించినవారే మళ్ళీ వచ్చి, " చూశావా! నీవు ఆ దైవాన్ని ఎంత నమ్మినా, నీ కష్టాలు తీరడం లేదు. నేను చెప్పాను కదా. దైవాన్ని నమ్మవద్దని అన్నాను. నా మాటను విన్నావా ?వినలేదు. " అని అంటారు. అందువల్ల మన మనసులో కలిగిన ఆందోళన, సందేహం మరింత బలపడవచ్చు

ఈ విధంగా, మనకు మనంగా కష్టాలను తీర్చుకోవడం సాధ్యం కాలేదు. రక్షించే దైవాన్ని ఆశ్రయించడం లేదు. అందువల్ల మన సమస్యలు తీరనే తీరవు. ఆటు దైవాన్ని ఆశ్రయించక, ఇటు మనం స్వయంగా కష్టాలను తీర్చుకోలేక, ఇక మనం సతమతం కావలసి ఉంటుంది. అంతే.

అందువల్లనే, భగవంతుడు గీతలో " నీవు, మొదటగా, ఒక విషయాన్ని నీవు ముఖ్యంగా తెలుసుకోవాలి. నేను అందరి విషయంలోనూ సమానంగా ఉంటాను– అని తెలుసుకొని, ఆ నిజాన్ని నమ్ము. "సమోహం సర్వభూతేషు" అని అన్నాడు.

భగవంతుడు అందరి విషయంలో సమంగా ఉంటాడు– అనే విషయాన్ని రెండు విధాలుగా గమనించి చూడాలి. భగవంతుడు అందరిలోనూ, అన్ని వస్తువులలోనూ, చేతనాచేతన పదార్థాలు అన్నిటిలోనూ, నాలోను నీలోను అంతటా ఉంటాడు. అంటే, అందరిలోనూ సమంగానే కదా ఉన్నాడు. "నేను మంచివారిలోనే ఉంటాను, చెడ్డ మనస్సు కలవారిలో ఉండను" అని అతడు చెప్పనే చెప్పలేదుకదా. ఇది అందరి విషయంలోనూ సమంగా ఉండటమే కదా. అందుచేత, భగవంతుడు ఉన్నాడు అందరిలోనూ ఉన్నాడు అందరిలోనూ సమంగా ఉన్నాడు. "భగవంతుడు ఉన్నాడు" అని నమ్మేవాడు "భగవంతుడు అందరిలోనూ ఉన్నాడు" అని కూడా నమ్ముతాడు. అంటే, భగవంతుడు సమంగా ఉన్నట్లే కదా.

"భగవంతుడు అంతటా, అన్నిటిలోనూ అందరిలోనూ ఉంటూ, వారిని నియమిస్తున్నాడు" అనే ఈ తత్వాన్ని క నమ్ముతున్నాము. ఎవరు. భగవంతుడే తమ కష్టాలకు కారణమని భావిస్తున్నారో, వారిని అడిగినప్పటికీ, ఈ విషయాన్ని వారు కూడా అంగీకరిస్తున్నట్లు చెబుతారు. "భగవంతుడు అందరిలోనూ ఉన్నాడు. అందరినీ

ధరిస్తున్నాడు. అందరినీ నియమిస్తున్నాడు. భగవంతుని అనుమతి లేనిదే ఏమీ జరగదు. చివరకు గడ్డి పరక కూడా కదలదు" అని వారు అంటారు, అంగీకరిస్తారుకూడా. అయితే, వీటితో పాటు వారు ఇంకా ఏమని అంటారంటే, "అవును నిజమే. దీనిని అంతటిని మేము కూడా ఒప్పుకుంటాం. కానీ, భగవంతుడే అందరిలోనూ ఉన్నాడు అని మేము ఒప్పుకున్న తర్వాత కూడా, సమంగా ఉన్నాడని అంగీకరించిన తరువాత కూడా, మరి, మేము ఈ విధంగా కష్టపడుతున్నామే! భగవంతుడు అందరి పట్ల సమానంగా ఉన్నట్లు తోచడం లేదే! " అని అంటారు.

కానీ, ఈ విధంగా భావించకూడదు. భగవంతుడు ఏ విధంగా మిగిలిన విషయాలలో సమంగా ఉంటున్నాడని మనం అనుకుంటున్నామో, ఆ విధంగానే, మనం సుఖంగా ఉండడంలోనూ, కష్టాలలో ఉండడంలోనూ కూడా భగవంతుడు సమంగా ఉంటున్నాడనే భావించాలి. భగవంతుడు అందరిలోనూ ఉంటాడని, అందరినీ నియమిస్తాడని, అన్నిటినీ నియమించగలిగిన శక్తిని కలవాలని ఒక పక్క నమ్ముతూ, మరొక పక్క, అతడు సమంగా లేడని, కొందరిని సుఖ పెడుతున్నాడని, మరి కొందరిని దుఃఖపెడుతున్నాడని భావించడం సరి అయినది అవుతుంది? అంతటా ఉండడం, అన్నిటినీ నియమించడం అనే విషయాలలో సమంగా ఉండేవాడు, ప్రేమను చూపించడంలో, కరుణను, ప్రీతిని చూపించడంలో మాత్రం తేడాగా ఏ విధంగా ఉంటాడు? అందుచేత, మనం ఇక్కడ జాగ్రత్తగా గమనించి అర్థం చేసుకోవాలి. మిగిలిన విషయాలలో భగవంతుడు సమంగా ఉన్నట్లే, ప్రేమను కరుణను చూపించడంలోనూ భగవంతుడు

అందరి విషయంలోనూ సమంగానే ఉంటాడు అని గ్రహించాలి. అయితే, మనం చేసుకున్న కర్మల కారణంగా, వానికి అనుగుణంగా మనకు అనుభవాలను కలిగిస్తూ, " ఇతడు మారనీ!" అని మనం మారే వరకు వేచి ఉంటాడు. అందువల్లనే మన జీవితాలలో ఈ విధమైన హెచ్చుతగ్గులు, సుఖదుఃఖాలు, ఎత్తు పల్లాలు ఏర్పడుతున్నాయి. ఈ నిజాన్ని గమనించి, ఎవరు "స్వామీ! నిన్నే ఆశ్రయిస్తున్నాను. నీవు తప్ప వేరు గతి నాకు ఎవరూ లేరు" అని నమ్మి, తనను ఆశ్రయిస్తున్నారో, వారిని భగవంతుడు తప్పక రక్షిస్తాడు. అందువల్లనే, భగవంతుడు సమో ఽ హం సర్వభూతేషు న మే ద్వేష్యో ఽ స్తి న ప్రియః" అని తెలుసుకొని, నమ్మి, నా విషయంలో భక్తిని కలిగి ఉండు. అప్పుడు నీకు మనసులో శాంతి కలుగుతుంది. ఎటువంటి ఆందోళన ఉండదు"అని భగవద్గీతలో అన్నాడు.

మనం కూడా, ఆ విధంగానే, భగవంతుని నమ్ముదాం. మనసులో ఎటువంటి ఆందోళనను సందేహాన్ని లేకుండా ఉందాం.